# గృహలక్ష్మి




# GRIHALAKSHMI

ol. No. 24 15th NOVEMBER 1955 No. 11

As. 6



ఈ నెల 14-వ తేదీన యావద్భారతంలో ప్రధాని పండిత నెహ్రూ 67వ జన్మది నోత్సవము వైభవోపేతంగా జరిగింది.



కుమారి ఆర్. ఇందిర

ప్రెసిడెన్సీ కళాశాలలో (మద్రాసు) ఎకనమిక్స్ ఆనర్స్ విద్యార్థిని. అభ్యుదయ నర్తకిగా సుశిక్షణ పొంది 1950 సం॥ నుండి అనేక సంస్థల సహాయార్థం ఆమె నృత్య ప్రదర్శనములు మద్రాసులోను, తదితర దక్షిణాది ప్రాంతాలలోను ఏర్పాటు చేయబడుతూ అనేకుల అభినందనాశీస్సులను పాత్రమైనది.

దీపావళి శుభ సందర్భమున మా ఖాతాదారులకు, స్నేహితులకు, అభిమానులకు హృదయ పూర్వక అభివందనములు!

పండుగలు — సాంప్రదాయము

# ఎల్. జీ. ఇంగువ

దీపావళి గతించిన శతాబ్దముల మన సంస్కృతికి, సంప్రదాయమునకు చిహ్నము. దీనిలో దేశమునకు, జాతికిని అత్యంత ప్రీతికరమైన సందేశము యిమిడి యున్నది. తరతరాలుగా మనలో అలవడియున్న అలవాట్లు, సాంప్రదాయము, ఆచారాలు అదృశ్యమై పోవుచున్న ఈ రోజులలో, దీపావళి పండుగ జరిగిపోయిన కాలముతో మనకు గల సంబంధమును జ్ఞప్తిపరస్తూ, యేటేటా ఆనందోత్సాహాలతో ఆచరింపబడే పండుగ కావడం సంతోషకరము.

గ్యారంటీ గల స్వాణ్యత, చక్కని సువాసన గల ఎల్. జీ. ఇంగువ నిత్య వంటకాలలోనేగాక, పండుగ, పబ్బాలకు చేయు పిండివంటలలో వాడ బడుటచే వాటికి రుచి, వాసనలు పెంపొందించుటయేగాక, గృహములందు సంతృప్తి, ఆరోగ్య భాగ్యములు గలుగజేయు సాంప్రదాయము ఎల్. జీ. ఇంగువ 60 సంవత్సరాలుపైగా కలిగి యున్నది.

**ఎల్. జీ.** మీరు ఎల్. జీ. ఇంగువనే అడిగి పేరు, మార్కు, చూచి పుచ్చుకోనండి **L. G.**

## లాల్‌జీ గోధు అండ్ కంపెనీ

సాహుకారుపేట, మద్రాసు-1. : : : హెడ్డాఫీసు : బొంబాయి

---

పాతురిడుగారి

# బాలసంజీవిని (Regd)

పిల్లల లివర్ అండ్ స్లీప్లన్ వ్యాధులను నివారించును

## డాక్టరు పిల్లా పాపయ్య పాత్రుడు అండ్ బ్రదర్స్,

19, దక్షిణ మాడవీధి, మైలాపూరు, మదరాసు-4. Phone 71354

కుంభకోణము బ్రాంచి : 1. సారంగపాణి కోవిల, తూర్పువీధి.

అన్ని మందుల షాపులలోను దొరకును.

నవయౌవన
ఉజ్వలజీవనానికి
విశ్వసనీయమార్గము

పండిత. డి. గోపాలాచార్యుల వారి

# జీవామృతం

బిగువైన కండరములతో
ప్రవిమలమైన ఉష్ణరక్తముతో
తేజోవంతమైన వర్చస్సుతో
నాదంపుట్టించే నరములతో
సుఖమయ జీవనమును
ప్రసాదించేది,
జీవామృతం.

ఆయుర్వేదాశ్రమం లిమిటెడ్
మదరాసు 17.

AMRUTANJAN
The Pain Balm
Amrutanjan Limited
BOMBAY, MADRAS

అన్ని
నొప్పులకు

అమృతాంజనము

ZANDU
ZUVIMALT

జండు జువిమాల్టు

ఇది బక్క-చిక్కి బలహీనులంగనున్న పసి పిల్లలకు బలమునిచ్చి శరీరమును వృద్ధి పొందించును. యిందు అన్ని రకముల విటమినులు చేర్చబడినవి.

1 పౌ. సీసా రూ. 6-0-0

ఆంధ్ర దేశములోను అన్ని మందుల షాపులలో దొరకును.



వ్యవస్థాపకులు :

డాక్టరు కే. యన్. కేసరి

# గృహలక్ష్మి

విజ్ఞాన వినోద ఆరోగ్య సౌభాగ్యములను
పెంపొందించుటకు ఏర్పడిన స్త్రీల
సచిత్ర మాస పత్రిక

ఆక్టింగ్ ఎడిటర్ :

సి. సి. పున్నయ్య

సంపుటము 24]  నవంబరు 1955  [సంచిక 11

# వి ష య సూ చి క





పండుగ పబ్బాల ముస్తాబు




జయజయ గృహలక్ష్మి సఖి! జయజయ లలితాంధ్ర! మధుర సారస్వతిమా!
జయజయ లలనా రత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణీ!



## దీపావళి బాణసంచా

కన్నుల మిరుమిట్లు గొల్పుతూ, చెవులు దిమ్మెక్కునట్లుచేసి భూవలయాన్నంతా దద్దరిల్లచేయు బాణసంచా దీపావళి పర్వదినపు ప్రత్యేకత. నరకంటకుడైన నరకాసుర వధతో ఆనంద పరవశులయిన ప్రజానీకం బాణసంచా వేడుకగా చేయసాగి ఆ పర్వ దినాన్ని ఏటేటా బాణసంచా, లక్ష్మీపూజ, విందులు, ఉత్సవాలతో గడుపుతున్నారు.

ముఖ్యంగా యీ సంవత్సరము యావద్భారత దేశపు ప్రజానీకపు మనస్తత్వాలు బాణ సంచాలాగ అనేకవిధాల పెల్లుబికియున్నవి. ఫజుల్ఆలీ కమీషన్ రిపోర్టు సంతృప్తి అసంతృప్తులకు, ఉద్రేక ఉత్సాహాలకు, సంతాప విచారములకు కారణమయింది.

కాని వాస్తవిక పరిస్థితుల దృష్ట్యా భాషాప్రయుక్త రాష్ట్ర విభజన మూల సూత్రము ననుసరించి పరిపాలనా సౌలభ్యాన్ని, జాతీయ ఐక్యతను ఉద్దేశించి భాషా ప్రాతిపదికమీద ఏరాష్ట్రానికారాష్ట్రము ఏర్పడి తమ సాంస్కృతిక, సాంఘిక, రాజకీయ

పురోభివృద్ధులను పెంపొందించుకొనవకాశమున్నప్పుడు ఇందులో ఎవరు విముఖులయినా, అసూయ, ఉద్రేకాలకు లోనైనా స్వార్థపరులనిపించుకుంటారు. జాతీయ శ్రేయస్సుకంటె స్వార్థపూరితమయిన అఘాయిత్యానికి, ఉద్రేకానికి ప్రాధాన్యత యిచ్చువారు దేశకళ్యాణానికేనాడును తోడ్పడజాలరు.

ఇక ముఖ్యంగా విశాలాంధ్ర, తెలంగాణావాదాలను పరిశీలించినచో భాషా ప్రయుక్త రాష్ట్రవిభజన ప్రాతిపదికకు ఏది అనుగుణ్యమయినదో తెలిసికొనుట చాల సులభము.

ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాలు రెండూ తెలుగు భాషా ప్రాంతాలు. ఒకే సంస్కృతి, ఒకే భాష. ఆచారవ్యవహారాలు, దైనందిన జీవితపు సామ్యము అత్యంత సన్నిహితము. కాని విద్య, వ్యవసాయ, పారిశ్రామికరంగాలలో తెలంగాణా ప్రజానీకం కొంత వెనుకబడియున్నా ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాలు ఏకకుటుంబంలాంటివి కాని విడివిడిగా రెండు రాష్ట్రాలుగా ఏర్పడ వాంఛించ తగినవికావు. రెండు ప్రాంతాలు ఏకమై విశాలాంధ్రగా సాధించగల పురోభివృద్ధి నిస్సందేహంగా తెలంగాణా ప్రత్యేకంగా సాధించుకోగలమని యూహించేదానికంటె మెరుగుగానుంటుంది.

అయితే తాము వెనుకబడియున్న రంగాలలో పురోభివృద్ధి గాంచడానికి తాము ప్రత్యేక రాష్ట్రంగానుండుటయే మేలని తెలంగాణా ప్రజల అభిప్రాయమైతే అట్టి అభివృద్ధిని ప్రజాస్వామ్య పద్ధతులలో తమకుగల ప్రాతినిధ్యమును వినియోగించి ఎందుకు విశాలాంధ్రలో సాధించకూడదో అర్థముకాదు. ఆంధ్ర, తెలంగాణా ప్రజలు ఉమ్మడిగా తమ పరస్పర భయ సందేహాల నివర్తికిగాను స్వార్థరహితంగా కృషి సల్పి విశాలాంధ్ర నిర్మాణమునకు దోహదంచేయాలి.

యావత్ప్రపంచము ఒకే మానవ సంఘంగా సమరస, సమైక్యతలతో కుల మతవర్గవిచక్షణా రహితంగా వర్ధిల్లాలని అభిలషించే యీ రోజులలో ఒకే భాష, ఏక సాంస్కృతిక, సాంఘిక సామ్యములుగల ఆంధ్ర, తెలంగాణా ప్రజలు ఒకే రాష్ట్రవాసులుగా వర్ధిల్ల విముఖులు కావడం శోచనీయము.



# ప్రభుత్వోద్యోగాలు — డిగ్రీలు

డిగ్రీలతో నిమిత్తము లేకుండా శక్తి సామర్థ్యాలు, యోగ్యతల ననుసరించి ప్రభుత్వోద్యోగాలలో నియమించడానికని కేంద్ర ప్రభుత్వము ఆలోచిస్తున్నదట. ఈ విషయమును విన్నవారు ప్రతి యొక్కరు జాతీయ విద్యా విధానములో ఏదో మహత్తరమయినమార్పు రానున్నదని ఆశించకమానరు.

ఏ ఉద్యోగానికయినా, వృత్తికయినా సుశిక్షణ, విద్యావిజ్ఞానాలత్యవసరము. విద్యా విజ్ఞానముల పూరించి, శక్తి సామర్థ్యాలను కలుగజేయగల విద్యా విధానము తప్పకుండా యోగ్యతనుకూడ సమకూరుస్తుంది. అట్టి యోగ్యతలు కలవారికి డిగ్రీలున్నవా లేవా అనే విచక్షణలేకుండానే ప్రభుత్వోద్యోగాలలో నియమించవచ్చును.

అయితే విద్యార్థులు యిట్టి అర్హతలను సంపాదించడానికి ముందుగానే భవిష్యత్తులో తాము చేయనున్న ఉద్యోగమేమిటో, అవలంబించనున్నవృత్తి ఏమిటో నిర్ణయించుకొని విద్యాభ్యాసము కొనసాగించాలి. విద్యార్థులుగా వారి వారికి అవసరమయిన విద్యా శిక్షణలను విద్యా విధానము రూపొందించి శక్తి సామర్థ్యాలను పెంపొందించిననాడు ప్రభుత్వోద్యోగాలకేకాదు - యితర ఉద్యోగాలకు సయితము డిగ్రీలతో నిమిత్తముండదు.

ఇదే విధానము ననుసరించే మహిళా విద్యా విధానముకూడ రూపొందించబడాలి. చదువుకోడమనేది గుమాస్తాగిరికని కాక తమకుగల అవకాశముల ననుసరించి తమ చదువు భవిష్యత్‌లో ఎలాగ ఉపయోగపడాలి అనేది నిర్ణయించుకొని విద్యాభ్యాసం కొనసాగించాలి. విద్యా విధానంలో లలితకళలు, సాంఘిక శాస్త్రం, వైద్యం, ఆరోగ్య శాస్త్రంలాంటివి పొందుపరచబడి సుశిక్షణతో శక్తి సామర్థ్యములుకలిగి పురుషులతోబాటు నిర్ణీత రంగాలలో దేశసేవచేయడానికి ఉపకరించాలి. ముఖ్యంగా భారత దేశ పరిస్థితుల ననుసరించి స్త్రీ పురుషులకు ఉద్యోగాలలోను, వృత్తులలోనుం పోటీని తప్పించడానికనువైన విధంగా డిగ్రీలతో నిమిత్తంలేని విద్యా విధాన రూపొందాలి. పోటీ అనేది లేకుండానే జాతీయ, అంతర్జాతీయరంగాలలో స్త్రీలు పురుషులు ఎవరికివారు చేయవలసినసేవ, మహత్కార్యాలు అనేక మున్నవి.

**ఉపన్యాసం – 6**

# ఈశావాస్యోపనిషదు

పూజ్యపాద శ్రీ స్వామీ చిన్మయానందజీ.

## ఉపనిషదులు

(గతసంచిక తరువాయి)

ఓం. ఈశావాస్యమిదం సర్వం యత్కించ జగత్యాం జగత్ ।
తేన త్యక్తేన భుంజీథా మా గృధః కస్య స్విద్ధనమ్ ॥

ఇది యంతయు, ఈ బ్రహ్మాండమున చరించునదంతయు, చరించనివాటితో సహా, ఈశ్వర అంతర్భూతమైయున్నది. (వ్యాపింపబడి, ఆవరింపబడి, లేక దొడుగబడియున్నది.) దానిని త్యజించి నీవు సుఖానుభవమును పొందవలెను. ఎవరి ధనమునకును ఆశపడకుము.

ఆత్మానుభవముపొందు మహా ఋషులు, సచ్చిదానందపదవి ననుభవించుచు, సూక్ష్మ సత్యస్వరూప వర్ణన, గంభీరవాక్యములతో ఈ ఉపనిషదును ప్రారంభించియున్నారు. సంస్కృతమున వాస్యం అను పదము అనంత సూచనలతోను, అనేక అర్థముల తోను కూడియున్నది. దాని అర్థము "వస్త్రము వలె కట్టబడియున్నది" "ఉడుపులవలె తొడగబడి యుండుట," "వసించబడియుండుట" కప్పబడి యున్నది లేక "వ్యాపింపబడియున్నది" అనికూడ యుండవచ్చును. ఈ శ్లోక సందర్భమున ఈ అర్థములన్నియు అన్వయించును. మహా ఋషి, "ఇది యంతయు" అని తెలుపుటలో మన జ్ఞానేంద్రియముల ద్వారా, మనసు, బుద్ధుల ఉపయోగములవల్ల తెలియగలిగినదంతయు, దృశ్యప్రపంచ ప్రభువగు ఈశ్వరునిచే వ్యాప్తమయియున్నది అని తెలియవలెను.

జీవశక్తి విషయాకారమును ప్రవేశించినప్పుడు ఒక జీవించు జంతువు అగుచున్నది. విషయ ప్రపంచమునందు ప్రతి వస్తువునందును జీవము నివసించుచున్నది. అందు ప్రతి భాగమునందును తనయొక్క సర్వవ్యాపకత్వమువలన సమానముగా నిండియున్నది. సత్యస్వరూపుడు తనయొక్క చైతన్యశక్తిని ప్రకటించుటకై ఒక విషయ కోశమును పొందుచున్నాడు. దానిని మనము జీవము అని తలచుచున్నాము. కాని, నిజముగా, వీటి యన్నిటికిని మూలాధారముగా, సర్వస్థలములు వ్యాపించి, జీవమునకు సూక్ష్మాంశశక్తి, ఆత్మయొక్క చైతన్యముయున్నది. అదియే ఈ విషయ జీవితములకెల్ల ప్రభువు.

ఈ శరీరము, మనసు, బుద్ధి, విషయ జనితములగుటవల్ల, స్వయముగా వ్యయముగా వ్యవహరింపజాలవని మనకు తెలియును. వీటికి చైతన్యమునిచ్చు జీవశక్తి యొక్కటి వీటిలో వ్యాపించియుండవలెను. ఇట్టి జీవశక్తి, విషయములకు ప్రభువని తెలుపబడుచున్నది. అతని సమక్షమున వీటికి జీవకళ ఏర్పడుచున్నది.

ఉపనిషదులయందు సత్యమును రెండు విధమార్గముల విమర్శించుచున్నారు. ఒకటి బాహ్య విషయ ప్రపంచమున, రెండవది సాధకుడు భ్రమచేత తాను అని తలచు ఈ కోశముల సమూహమున ఆంతర విచారము సలుపుట. ఈ ఉపనిషదునందు తొలిమంత్రమునందే, గొప్ప ప్రబోధవాక్య మారంభమగుచున్నది. సాధకుని సమ్మేళిత శరీర స్వరూపము ప్రభువగు "ఈశ"చే అధిష్ఠింపబడియున్నది. అట్టి సాధకుడు ఇట్టి ఆత్మ తనయందు మాత్రము దివ్యకళతో ప్రకాశించుచున్నాడని పొరబడుట సహజము. బహుశ, సాధకుడు కొంత విశాల హృదయముగలవాడైన

యెడల తనతో సరిసమానముగా మానవరాశినంతయు ఎంచి, ఆత్మ మానవ శరీరములలో మాత్రము యున్నా డని తలచవచ్చును.

ఇట్టి భ్రమను సాధకునియందు తొలగించుటకై ఈ మొదటిమంత్ర తొలిపాదమునందు, "ఈ" అను సర్వనామమునకు ఒక విశేష వాక్యము చేర్చియున్నది. "బ్రహ్మాండమున చరించునదియెల్ల, చరించక యుండు నదియెల్ల" అని, దానియొక్క భావమును విపుల ముగా తెలుపబడుచున్నది. ఈ యావత్తు ప్రపంచ మున జరుగు, స్పర్శలు, అనుభవములు, ఆలోచనలు, అన్నియు ఆ సత్య పరమాత్మయందు జరుగుచున్నవి. సముద్రమున అలలు, బుడుగలు, నురుగు, సుడులు మొదలగునవి కలిగియున్నట్లు; సముద్రము లేనిది అలలు యుండవు. అలకును సముద్రమునకును భేదములేదు. అల అనగా, సముద్రముయొక్క శక్తి, గాంభీర్యము, బలముయొక్క ప్రకాశము. అటులనే, బ్రహ్మాండ మునగల రూపనామములన్నియు శాశ్వత సత్య స్వరూపుని యొక్క ప్రకాశములు. ఆచైతన్యము లేకున్న అవి యుండుటే అభావము.

ఉదాహరణమునకు ఇక్కడ ఒక వృక్షమున్నది. ఆ వృక్షమును మన అనుభవములవల్ల విశదీకరించిన, ఆ వృక్షమువల్ల మనకు కలుగు, రూపము, శబ్దము, రుచి, వాసన, స్పర్శజ్ఞానములవల్లకలుగు అనుభవముల రాశిగా తేలుచున్నది. ఈ అనుభవములన్నియు మన జ్ఞానేంద్రియములవల్ల తెలుసుకొనుచున్నాము. ఈ జ్ఞానేంద్రియములులేకున్న ఈ అనుభవములు కలుగ జాలవు. ఆ వృక్షము నశింపచేసినవెనుక, దానినుండి మన మనసుకు ఎట్టి అనుభవములు కలుగకపోయినను, అది ఒక శూన్యభావముకాదు. పై అనుభవాంశ ములు కనుగొనుచుండినపుడు, వీటి కన్నిటికి అంతర్యా మిగా ఒక సమాన సూక్ష్మాంశము వ్యాపించియుండుట మనము కనుగొనుచున్నాము.

"ఒక చెట్టుకు ఒక రూపమున్నది. ఒక రుచి యున్నది. ఒక శబ్దమున్నది. ఒక వాసనయున్నది. ఒక స్పర్శయున్నది" అని గమనించుచున్నాము. ఇట్టి జ్ఞానేంద్రియ జన్యగుణములన్నియు తొలగించినను, ఒక "అస్తి" త్వగుణము ఆ చెట్టుకుయున్నది. ఇట్టి భావము "అస్తి" అనుటతోనే, తెలుపబడ కయే ఏర్పడుచున్నది. ఈ అస్తిత్వభావము ఒక దివ్య శక్తి. ఇది లేకున్న ఈ అనుభవములన్నియు సాధ్యములేదు. కాని మానవుడు తన వ్యవహార ధోరణిలో ఇట్టి భావమును కనుగొనలేకున్నాడు.

ఈ స్పర్శానుభవముల కన్నిటికిని ఈ పరి పూర్ణ మహాజీవశక్తి సూక్ష్మ జీవకళగా, సర్వ వ్యాపకత్వముతో, శాశ్వతముగా వ్యాపించియున్నది. ఆ శక్తిని మనము మన ఇంద్రియ స్పర్శాది జనిత అను భవజ్ఞానములను త్యజించి, అనుభవించ ప్రయత్నించ వలెనని ఋషి, కడుదయతో ఉపనిషదుయొక్క మొట్టమొదటి శ్లోకముతోనే బోధించుచున్నాడు. స్పర్శజ్ఞానములు మార్పుచెందుచుండునుగాని, వాటికి ఆధారమైన సత్యము మార్పులేనిది. స్పర్శములు నశించును. కాని సత్యము నాశములేనిది. స్పర్శ లన్నియు ద్వంద్వములతో కూడినది. సత్యము ద్వంద్వాతీతము.

ఇట్టి సర్వవ్యాపక సత్యముతో ఐక్యముగాంచుటే అంతరాత్మను తెలుసుకొనుట. చంచలవిషయ ప్రపం చమున సత్యమును వెదకుట యనగా, బాహ్య ద్వంద్వ ప్రపంచంలో సత్యమును కనుగొనుట ఇది ఎట్లు సమన్వయముగ సాధ్యమో తెలుపుటయే, ఈశావాస్యోపనిషదుయొక్క ముఖ్య సిద్ధాంతము. విచారణముందుకు సాగుచుండగా అది విశదము కాగలదు.

ఒక మహాబలశాలి, శక్తి స్వరూప ప్రభువు ఒకడు ఈ విషయ ప్రపంచమునంతయు పరిపాలించుచున్నాడు అని తెలిసినపుడు, అట్టి పరిపూర్ణ ఆనందస్వరూపుని అనుభవము పొందుటకు గురువు ఉపాయము తెలుపు చున్నాడు. అసత్య విలువలు, మమకారబంధములు, మన ఇంద్రియ వ్యాపార మహారణ్యమున మనము

ఎన్ని సంపాదించుకొని యున్నామో వాటినెల్లను త్యజించుటవల్ల కలుగును అని తెలుపుచున్నాడు.

ఒక భూత దృశ్యము, భ్రమచెందినవానిని భయపెట్టుచున్నది. అతని మనసు చిక్కులకు, వికారములకు పాలగును. అతనిని ఓదార్చి, అతనికి మనశ్శాంతి, సుఖము కలిగించవలెనన్న, అతడు కూచమును తెలుసుకొనునట్లు చేయవలెను. నా స్నేహితుడు భూత దృశ్యముచేత భ్రాంతి కలిగియుండినయెడల, ఆ కూచమునుచూచు నేను, నా స్నేహితులుకూడ, అతనికి చేయగల సహాయము "మిత్రమా! భూతముయొక్క రూపము, గుణములను మరచిపొమ్ము. సుఖముగా నుండుము" అని చెప్పగలము. భూతమును మరుగున కూచమున్నది. భూత దృశ్యమువలన పూర్తి మనో చంచలతపొంది, కూచమును చూడగల శాంతభావము గాని, జ్ఞానస్థైర్యముగాని లేకున్నాము. కూచమును చూచినయెడల భూతము వుండజాలదు. కూచమును చూచుటతోనే మనశ్శాంతి కలుగుచున్నది. ఎందుకనిన, ఇప్పుడు కలిగియుండు మనోదడకంతయు, దృశ్యప్రమాదమే కారణము. అందువలన భయము కలుగుచున్నది.

ఈ ఉపనిషదుయొక్క మహా పురుషుడు, మొదటి మంత్రముతోనే, అసత్యము త్యజించుటవల్ల సత్యమును అనుభవించు సుఖము పొందుడు అని శిష్యులకు తెలుపుచున్నాడు.

ఇట్టి తొలిమంత్రమునందు సత్య ప్రవచనము, అందుగల వ్యాపకములు తెలుపుటయేగాక, అనుభవింపగల నిర్ణీత విధానమునుకూడ సూచింపబడియున్నది. ఇందువల్లనే దీనిని పరిపక్వ వాఙ్మయమునను, వేదాంత సిద్ధాంత సౌందర్యమునందును సాటిలేని ఉన్నతపదవిని స్థాపించవచ్చును. కాని ఇంతయే కాదు – ఈ కార్యమున పట్టాభిషేక కార్య సంపూర్ణము చేయుటా అనినట్లు, ఈ మంత్రములోనే, ఒక వాక్యభావమువల్ల, అట్టి పరిపక్వదశపొందిన మహానీయుడు అటు పిమ్మట ఎట్లు వ్యవహరించును, ఈ యాత్రయందు సంచరించు సాధకుడు ఎట్లు జీవించ ప్రయత్నించవలెనో, ఆ విషయములుకూడ ఋషి తెలుపుచున్నాడు. సాధకులకు సూచన తెలుపునట్లును, పరిపూర్ణ పురుషుడు పొందియుండు మనోభావములను శ్లోకమునందలి నాల్గవ పాదమున తెలుపబడుచున్నది. "ఇతరుల ధనమునకు దురాశ పొందవద్దు" దురాశ అనునది కోరికలు అను బురద గుంటలవల్ల కలుగును. కోరికలవల్ల ఆలోచనలు కలుగును. ఆలోచనలు కార్యములుగా దురవస్థ పొందుచున్నవి.

ఈ ఉపనిషదునందు ఋషి సాధకుని, ఇతరుల ధనమునకై దురాశపొందవద్దు అని ఉపదేశము చేయుటలలో సాధకుడు తన కోరికలను వశపరుచుకొనుటయందు చక్కని శిక్ష పొందు మార్గము తెలుపుచున్నాడు. కోరికలను వశపరుచుకొనుటవల్ల, కార్యములు వశపడుచున్నవి. తదనుగుణముగా మన అజ్ఞానము లేక భ్రమనుండి కలుగు వ్యవహారములు నశించగలుగుచున్నది.

శ్రీ శంకరులు ఇంతకన్న కొంత ఉన్నత పదమును తెలుపుచున్నాడు. అతని అభిప్రాయమున ఈ శ్లోకమునందలి నాల్గవ పాదమునకు ఇట్లు అర్థమును తెలుపుచున్నాడు. "ధనము ఎవరిది" అని ఋషులు కేకలు వేయుచున్నారు. ఈ ప్రశ్నవల్ల ఒకరి ధనము అని చెప్పగలదేదియును లేదు. ఈ బ్రహ్మాండమున మనతోకూడ శాశ్వతముగా నుండునది ఏదియును లేదు. మనముకూడ వెళ్ళిపొయ్యేవారము. ప్రపంచ విషయ వస్తువులన్నియు అశాశ్వతములు. ఇట్టి శాశ్వత మార్పులలో కోరువాడు ఎవరు, దేనిని కోరగలడు అని అభిప్రాయమును తెలుపుచున్నాడు. ఇట్లు ఈ ప్రపంచమున ఏదియు కోరదగియున్నది? అను భావమునుచూచి నవ్వుచున్నాడు. ఎందుకన ఈ బ్రహ్మాండమున కోరదగిన వస్తువు ఒకటియు లేదు.

(సశేషము)

# తుమ్మ ముళ్లు

శ్రీ 'విజయ – రాఘవ'



(గతసంచిక తరువాయి)

సరోజిని బ్రహ్మాజీరావుకి గారాబపు పట్టి. తల్లి చనిపోయిన నాటినుంచి బ్రహ్మాజీరావే అన్నిరంగాల్లో సమయోచితపాత్రను ధరిస్తూ, ఆమెను ఆదుకుంటూ కాపురానికి పంపాడు. మల్లిఖార్జునరావు బ్రహ్మాజీరావుకి నాల్గో అల్లుడు; మనిషి నలుపైన బుద్ధినలుపు గాదు — చాల సహనపరుడు. శాంతి స్వభావి. స్కూలు ఫైనలువరకూ చదివి పూరుకొన్నాడు. కోలవెన్ను స్వగ్రామం. చాలా గౌరవంగా బ్రతుకుతున్న కుటుంబంలో పుట్టి పెరిగినవాడు. మల్లిఖార్జునరావంటి వ్యక్తి బ్రహ్మాజీరావుకి అల్లుడవటం, మరయేనాడో బ్రహ్మాజీరావు చేసుకొన్న పూర్వ పుణ్యఫలమే. చాలా అదృష్టవంతుడుకూడా. కాని బ్రహ్మాజీరావు యీ అదృష్టాన్ని యీనాటివరకు వినియోగించుకోలేక పోతున్నాడంటే; అది యెవరి కర్మో ఆలోచించాలన్నా తట్టని సమస్య. పల్లెత్తుమాట పడడు—పల్లెత్తిమాట అనని వ్యక్తి మల్లికార్జునరావు. సరోజిని పెళ్ళయిన తర్వాతే బ్రహ్మాజీరావుకి భార్యావియోగం కలిగింది. సుబ్బారావు మాత్రం అత్తగారి చావుకి అలివేలుమంగని చూడటానికికూడా పంపలేదు. మిగతావాళ్ళంతా రావడంలో ఆశ్చర్యమేముంది !

అప్పటికి అరుంధతి కాపరానికి రానేవచ్చింది. రామకృష్ణ, అరుంధతి సంసారంలో యిమిడివున్నట్లయితే బ్రహ్మాజీరావు చాలా సుఖపడేవాడు. కాని తనేదో సోమయాజి నిష్ఠలన్నీ యీనాడు చూపాలని అనుకొంటే, ఆ సంసారంలో అటువంటివేమీ ఆటలాడించడానికి అనుగుణ్యమైన తావుకాదు. అయినవరకు యింత వండుకుతినడం, వేళకు యెవరైనా వస్తే వున్నదిపెట్టి, గౌరవంగా చూడటంతప్ప మరే అలవాటు అయింట్లో జరుగుతున్నట్లు కనబడదు. బ్రహ్మాజీరావు చీటికిమాటికి చిందులు తొక్కుతూ రామకృష్ణ సంసారం గురించి తనలోతాను వితర్కించుకొనేవాడు. "కావాలని పెంచుకొన్న రామకృష్ణ సంసారంలోంచి తను ఈనాడు వేరుబడి, కాపురానికి వెళ్ళనున్న సరోజినిని తనకు వండిపెడుతూవుండమని అర్థించడమూ, అలాగే కాలం కడతేర్చుకోవాలని అనుకోవడమూ, యెంతవరకు ప్రపంచానికి నచ్చినట్లుంటుంది." అని కొన్నాళ్లు భావించాడు. రామకృష్ణ—అరుంధతులు మర్యాదగా బ్రహ్మాజీరావుని తమ సంసారంలో యిమిడివుండమని కోరారు. కాని, మంచిమాటలు మనస్సుకెక్కేస్థితి, మర్యాద నిలుపుకుందామనే కాంక్ష, హాయిగా బ్రతుకుదామనే జ్ఞానం శూన్యం కావడంవల్ల బుద్ధి పెడదార్లు తొక్కింది. ఏనాడైతే బ్రహ్మాజీరావు ఆ సంసారంలో యిమిడివుంటానికి తిరస్కారభావం వెలిబుచ్చాడో, ఆనాటినుంచీ కొడుకు, కోడలుకూడా ఆయనకు సంబంధించిన యే విషయాల్లోకూడా జోక్యం కలిగించుకోవడం పూర్తిగా మానివేశారు. సరోజిని వండుతూపడుంటే, తింటూ కాలం వెళ్ళబుచ్చుతున్నాడు. "ఎందుకింత వరకు మళ్ళా అత్తవారింటికి అడుగు పెట్టలేదు?" అనే ప్రశ్న వారికి, అయినవాళ్ళల్లోనూ కలగనే కలిగింది.

## 6

మల్లికార్జునరావు బందరులో సెకెండుగ్రేడు ట్రైనింగు చదువుతున్నాడప్పుడు. సరోజిని గొల్లపల్లి నుంచి కదిలే పరిస్థితిలో లేదు. ట్రైనింగు అయ్యేంత

వరకు, పోనీ అక్కడే వుంటే మంచిదని, మల్లికార్జునరావుకూడా పెద్దగా సరోజినిని గురించి ఆలోచించ లేదు.

ఒకనాడు రాత్రి హఠాత్తుగా పన్నెండు గంటలప్పుడు యిద్దరు పోలీసుల్తో ఒక హెడ్ కానిస్టేబిల్ మల్లికార్జునరావు రూంకివచ్చారు. అందరూ నిద్రపోతున్నారు. తలుపు తట్టగానే మల్లిఖార్జునరావు స్నేహితుడు తలుపు తీసాడు. ఇంత రాత్రిప్పుడు, యెటూగాని వేళ యీ పోలీసువాళ్ళదాడి యేమిటని, స్నేహితుడు గాబరాపడ్డాడు. నెమ్మదిగా మల్లికార్జునరావునికూడా లేపాడు.

హెడ్ కానిస్టేబిల్ చాలా మంచివాడు. అదృష్టం వల్ల బాగా తెలిసినవాడు. మల్లిఖార్జునరావు మెల్లగా పక్కమీదనుంచి లేస్తూ హెడ్ కానిస్టేబిల్ ని చూసి దిగ్భ్రాంతుడయ్యాడు. కూచోమని మర్యాదచేసాడు. కాసేపటికి ఒకరికొకరు పరామర్శించుకొన్నారు. తరువాత కానిస్టేబిల్ నెమ్మదిగా లేస్తూ — "మల్లిఖార్జునరావుగారూ! యేమనుకోకుండావుంటే. ఒకసారి బయటికి వొస్తారా!" — అన్నాడు.

మల్లిఖార్జునరావు వంకిన తగిలించిన చొక్కా తొంటికి తగిలించి, పెట్టెమీదవున్న తాజ్ మహల్ బీడీ కట్టని, అగ్గిపెట్టెని జేబులో పెట్టుకొని, లుంగీతోనే బయటకొచ్చాడు. పోలీసువాళ్ళిద్దరూ రూంలోకూర్చొని సినిమా పుస్తకాలు తిరగవేస్తున్నారు. హెడ్ కానిస్టేబిల్ మల్లిఖార్జునరావు యిద్దరూ రూం విడిచి యిరవై గజాల దూరంలోకి వెళ్ళి నిలుచున్నారు.

ఇద్దరూ బీడీలు ముట్టించారు. హెడ్ కానిస్టేబిల్ నెత్తిమీద టోపీ తీస్తూ—

"మీరు చాలా గౌరవంగా బ్రతుకుతున్నవారు. కర్మం కాలినప్పుడు మంచికూడా చెడు అనిపించుకొంటుంది. నిజానిజాలు పరిష్కరించడం ప్రస్తుతం మనం వూహించినా తట్టని విషయం. నేనుకూడా మొదట్లో నమ్మలేదు సుమా! కాని నా డ్యూటీ యేమిటో నేను నిర్వర్తించాలిగదా!" — అంటుంటే మల్లిఖార్జునరావు పాదాలక్రింద భూమి నమ్మినవాళ్ళెవరో త్రవ్వుతున్నట్లుగా వుంది. డగ్గుత్తిగావున్న కంఠాన్ని సారించి— "ఏమిటో చెపుతున్నారు. కాని అర్థం కాకుండా వుంది" — అన్నాడు.

"మళ్ళా చెప్పమంటారా! యీసారి వున్నదున్నట్లుగా చెబుతాను" — అన్నాడు కానిస్టేబుల్.

"అయితే కూర్చొని చెప్పకూడదా"మని యిద్దరూ కూర్చొన్నారు.

హెడ్ కానిస్టేబుల్. నడుంకి వున్న బెల్టుతీస్తూ—

"గొల్లపల్లి మీఅత్తవారి వూరుకదూ! యీమధ్య అక్కడ ఒక దొంగతనం జరిగింది. బ్రహ్మాజీరావుగారి యింటిముందున్న కమ్మవారియింట్లోపోయిన చీరెలు— మరికొన్ని నగలూమాత్రం బ్రహ్మాజీరావుగారింట్లో దొరికినాయి. బ్రహ్మాజీగావుగారి అమ్మాయి సరోజిని యీ దొంగతనానికి కారకురాలని, రూఢిగా తెలుస్తోంది. పోయిన వస్తువులు వారింట్లోనే దొరకడం వల్లనూ, సరోజినిగారు మీకు భార్యగారు కావడం వల్ల మిమ్ముల్నికూడా యీ సందర్భంలో ఆ చూకీ తీయవలసిన పనివుంది. దయచేసి మీరేమనుకోకుండా వుంటే, మీ రూం సోదాచేసుకొని వెళ్తాం. మరి అనుమతికోరుతున్నా" అని గౌరవంగా అడిగేటప్పటికి—మల్లిఘార్జునరావు నమ్ముకున్న పాదాల క్రింద భూమిని త్రవ్వగా యేర్పడినగోతిలో పడ్డాడు. తలెత్తి శూన్యాకాసంలోకి తొంగిచూస్తూ విషయంగురించి ఆలోచిద్దామనుకుంటే బలంగా, మెదలేవకుండా ఒక గట్టివస్తువేదో వంచేస్తోంది. శరీరాన్నంతటిని తుమ్మముళ్ళతో గుచ్చినట్లుగా వుంది. ఒక్క నిట్టూర్పు బరువుగా వదులుడూ —

"అయితేరండి! మీ పని మీరు పూర్తిచేసుకొని వెళ్ళండి"— అని మాత్రం అనగల్గాడు.

ఇద్దరూలేచి రూంకివచ్చి, వెతకడం ప్రారంభించారు. గంటా గంటన్నర వెతికిం తరువాత కానిస్టేబుల్ మందహాసంగా—

(సశేషము)

# దేవహూతి భక్తియోగము

శ్రీమతి యస్. యామినీపూర్ణతిలకమ్మ

భక్తియనగా దేహధారికి అమృతధారవంటిది. అవ్యక్తుండైన పరమాత్మ నెరుంగుటకు ఎట్లు దుర్లభమో భక్తియొక్క గమ్యము గనుంగొనుట కట్లు దుర్లభము. పుత్రమిత్ర విభవ కాంక్షితులై నారాధించుట భక్తి కాదు. ఎరుకగలిగి సర్వభూత దయాళువులై శమ దమ సంపన్నులై స్వార్థత్యాగ బుద్ధితో అవ్యాజంబుగా నారాధించునదియే భక్తి. భక్తియొక్క అంతరంగపు పట్టు అరయజాలము. భక్తి మహా మహిమ గలది భక్తి ప్రపంచలాభము కొఱకు గలుగదు. భక్తి ఎప్పుడు ఎవరియడ ఎందులకు జనించునో నెరుగజాలము.

దేవహూతి స్వాయంభువ మనువు యొక్క ద్వితీయపుత్రిక. అసమాన సౌందర్యవతి. ప్రతిభాశాలి. భావగాంభీర్య విచక్షణాన్విత, విభవోపేతులైన రాజలోకము నందేని వివాహమాడనొల్లక బిందు సరోవరమున తపము గావించు కర్దమునికడకు జననీ జనకులతో సహా నరిగి తండ్రిముఖమున వివాహకాంక్ష కర్దమునికి నెరుకపరచెను. అంతకుమున్న శ్రీ మహావిష్ణువలన దేవహూతి తనకు భార్యకాగలదను వార్త ఆలించి సిద్ధముగనున్న మునీశ్వరుడు ముదమంది లోకకల్యాణముగా వివాహమాడెను. మహామహుల కృత్యములు లోకాభ్యుదయకరములుగదా ! అట్లు స్వాయంభువు పవిత్రధర్మముతో దేవహూతి కర్దములకు వివాహమొనర్చెను. అల్లుని కొసంగవలసిన కట్నకానుకలు రాజ లాంఛనముగా నొసంగిన కొలది మాత్రమే గైకొని మిగిలినదంతయు మరల మామగారి కొసంగి యిట్లనెను. తపోనిరతులమగు మాకేల యీ సంపదలన్నియు. తపమే మాకుధనము. తపస్సే సకల సంపత్తులు. అన్నిటికి మిన్నయగు నాకనురూప గుణాన్వితయగు నీ కుమారి నొసంగితివి. అంతియే చాలు. మరియొక్క సమయముగలదు, సంతాన పర్యంతము సంసారమునందుండెదను. ఆవల మరల యేకాకినై అడవులకేగెదను. ఆ వాక్యమునకు తండ్రి కూతు లిరువురియ్యకొనిరి. లోకమున నిజముగా వివాహమను బంధము భగవానుని సృష్టికొరకేర్పరుప బడినదికాని యింద్రియ చాపల్యమునకు గాదుగదా ! ఇంద్రియ కింకరులు ఆత్మభృత్యులు. ఆత్మ చెప్పు చేతలలో మెలగి ఆత్మకు హితమొనర్చుట కేర్పడిన వారు. ఆత్మయను రాజును గోతిలో గూలద్రోసి ఆత్మధనమును దోచుకొను ద్రోహులగు చోరులవంటి వారు కారు. ప్రబల ప్రభావ తపస్సంపన్నంబగు ఆత్మరాజును యింద్రియ కింకరులేమి చేయగలరు!

అంత స్వాయంభువు అల్లునకు చెప్పవలసిన బుద్ధులు కొన్ని చెప్పి కూతునిసిరంబు మూర్కొని చుంచుదువ్వి చుబుకంబు పుడికి కన్నీళ్లుకార్చి ఆడుబిడ్డలగనుట అగచాట్లు గనుటయే ననుకొని కూతు వియోగంబునకు గుందుచుండెడి డెందంబును చిక్కబట్టుకొని పయనంబాయెను. అంత జనని కూతుంగవుంగలించుకొని బావురుమనుచు తల్లీ! సుకుమార గాత్రివి యీ గహన తలంబున నొంటి నెట్లుండగలవు? ఎండవానల కెరువని యతీశ్వరుని పెండ్లాడితివి. ఇచట దాసదాసీజనంబులు లేరు. హంసతూలికా తల్పంబులు లేవు. మధురమైన మంచి మనోరథాన్నములు లేవు. అమృతంపు భక్ష్యములుండవు. చంద్రచంద్రిక లంబోలు దధిక్షీరఘృతంబులుండవు. ఏరీతి భుజింతువు ! ఏ రీతి శయనింతువు ! నీమనంబగాధంబుగదా! భూమండలం బంతయును చుట్టి ఎట్టకేలకు యీ కర్దముని కల్యాణంబైతివి. నీతలంపెద్దియో నావంటి గ్రామ్య జీవితములకు అరయ నసాధ్యము తల్లీ! పోయివచ్చెదము. మునికెదురాడకుము. సమయమెరింగి సకల శుశ్రూషలొనర్పుము. సతికి యిహపర సౌఖ్యములకు పతియె నిదానముగదా ! నీవెరుంగరానిదేమున్నది.

నీవు వివేకవు. ఏకాంత భక్తురాలివి. అందుకొరకే ఏకాంతుడైన భర్తను వెదకుకొంటివి. మీ యిరువురకు ఆ పరమేశ్వరుడే ఆధారము. కూతులం గొడుకులం గని ప్రజాభ్యుదయము గావింపుడు. త్వరలో జననివి గమ్ము, అని ఆశీర్వదించి తలిదండ్రులు తరలిరి. ఎట్టి ధీరులకైనను కూతుల వియోగంబు గుండుల కాకరంబులుగదా! దేవహూతి తలితండ్రుల వియోగంబున కించుకంతయు గుందక సకల సంతోషాయత్త చిత్తయై భర్తయెడ ఏమరుపాటులేక సమయానుకూలంబుగా పత్రపుష్పఫలంబులర్పించుచు బిందుసరోవర సుందరోద్యానంబులందు భరింపుచు తనలో అవ్యాజంబున దాగియున్న భక్తియను నమృతమును తనివిదీర సేవింపుచు మోహరుచులంబోక సంచరింపుచుండెను. బిందుసరోవరమునందలి పక్షిబృందంబుల కలకలారావంబులాలింపుచు, మయూరనర్తన విశేషంబులు గుర్తింపుచు, క్రూరమృగంబుల శాంతరసంబునకు చకితయగుచు, కర్దముని మహిమ కబ్బురపడుచు నిబ్బరమైన మనంబున నుబ్బుచు లోలోన యీశ్వరలీలలందలంచుకొని ఆనందింపుచు కోరికలపంక తొంగి చూడక ఎడతెగని కర్మభక్తియోగములే భగవత్ప్రసాదములనియు, భర్తయు ప్రత్యక్షదైవమనియును ప్రొద్దుల మ్రొక్కులిడుచు సృక్కక సేవలు గావింపుచుండెను. ఇరుప్రొద్దుల కర్దముండు తపస్సమాధి యందున్నప్పుడు పరమాత్ముని ధ్యాననిష్ఠతో నారాధించును. అపరాహ్ణమునకు కందమూలాదులు పచనమొనర్చి ముందుగా భర్తకిడి తదనంతరము తాను గుడుచును. ఏమరియైననూ భర్తను సువిలాసమగు చూపులతో చూడదు. భర్తకెదుర నిలువదు. ఏతన్వీమణి నూతనవివాహితయై శృంగారముల పొంతపోవకుండును? ఇదియంతయు భక్తియొక్క అద్భుతసామర్థ్యము. వారలకిది వ్రతసమయము. ఏమహానీయుడు ముద్దరాలినొద్ద నిడుకొని అగ్నిచెంతగ రంగని రాతిచందంబున సంచరించగలడు? స్థితప్రజ్ఞులస్థితులిట్టివేగదా! తలిరాకుబోడి తన చేయి తలగడగా నిడుకొని పర్ణశయంబున శయనించును. భర్తకొక పర్ణశయనంబును దూరంబున నమర్చును. భర్తమేల్కొనక మున్న మేల్కొని బిందుసరోవర సలిలగాహయై భగవన్నుతి మొదలగు ఆత్మకృత్యముల నొనర్చుకొని తపోగృహము అలికి ముగ్గులిడి దీపాదులు వెలిగించి పత్రపుష్పఫలతోయాదులు భర్తకొరకు సిద్ధపరచును. మునియు వంచినమోము నెత్తక స్నానాది కృత్యంబులు నెరవేర్చుకొని తపోగృహము ప్రవేశించును. అంతయింతి కందమూల ఫలాదులు పచనార్థము ఎండుకట్టియలు మున్నగునవి తెచ్చియుంచును. విరామ సమయములందు భగవంతునిట్లు ప్రార్థించును. ప్రభువర్యా! నీ మహిమ కనుంగొన నెంతదానను. సర్వభూతముల సృజించి రక్షించి తుదకు తెగటార్చి నీలో జేర్చుకొందువు. ఈ లీలకు గతంబెయ్యదియో గోచరంబుగాదు. మనుజులలో గ్రామ్యబుద్ధులు జ్ఞానబుద్ధులునను రెండుతెగలు గలవు. గ్రామ్యబుద్ధులకు నిరంతరమూ వారి భోగములు దుఃఖములు పరస్పర విద్వేషముల వలన కలిగిన యుద్ధములతో వారి జననమరణ ప్రవాహములలో వారు కొట్టుకొనిపోవుదురు. జ్ఞానబుద్ధులు నిరంతరము నిను ధ్యానింపుచు నిన్నే జింతింపుచు నీకై అనేకములగు త్యాగము లొనర్చుచుందురు. ఇయ్యవి మనుజులు జన్మాంతర సుకృత దుష్కృతంబులనవలయును. నిను జింతింపనివారిని గురించి నిరంతరము దలంచుచుండెదను. వారికై జాలిపడెదను. వారికాపదలు ఆరాటంబులు గలవు. కామక్రోధలోభమోహములనియెడి శత్రువులచే జిక్కి తత్తరపాటు నొందుచుందురు. అట్టివారిని రక్షింప నీవ సమర్థుండవు. జీవసంజ్ఞచే వేదనల నందుచున్న ఆత్మలను జూచి అంతరంగమున గుందుచుందును. దివారాత్రంబులును వసంతాది ఋతువులతో అయనంబులతోగూడిన నీ కాలచక్రమహిమ గనుంగొని అబ్బురపడుచుందును. దేవాదిదేవా! దయామయా! నాకీ మహిమాన్వితుండైన భర్త నొసంగితివి. నీయట్ల దలంచుకొని మహాత్మునకు సేవ లొనరింపుచున్నదానను. నాయందలి దోషంబులను బరికించి దిద్దుబాటు గావింపుము. ఇంకనూ నాకు కష్టసహిష్ణుతయును శమదమ దితిక్ష ఉపరతి చిత్తసమాధాన శాంతాదులనూ పట్సంపద లొసంగి నేను కోరు నా సహోదర లోకంబునకు

నిరంతర ఘోరశరీరరుజలు ఆత్మరుజలు లేకుండగా గావింపుము.

“ ఓం సర్వేవై సుఖినస్సంతు
సర్వేస్సంతు నిరామయాః।
సర్వేభద్రాణి పశ్యంతు
నకశ్చిత్ దుఃఖభాగ్భవేత్ ।

అని దేవహూతి ప్రార్థింపుచుండగా కొంతకాల మరిగెను. అంత నొక్కరాత్రి దేవహూతి నిద్రించు సమయమున నొక దివ్య స్వప్నము గాంచెను. బిందు సరోవర పరిసరమంతయును ఘనమగు తేజంబుతోనిండి ఆ తేజమునందు కర్దముండు మధ్యనిలుచుండి తటాలున తన గర్భంబు జొచ్చినట్లు దోచెను. తోడనే మేల్కాని కలగతంబెయ్యదియాయని కొంతకాలంబు చింతింపుచుండెను. శుభనిమిత్తమైన స్వప్నముచే తన్వీమణి సంతసంబునకు మేరలేకుండెను, భక్తిపరాధీనుండు భగవంతుడని ఆమెకు నమ్మకము కలిగి లోకమునకు తనకునైద్దియో ఆత్మకల్యాణ మొదవుననుఆశచే తుష్టి పుష్టులు గలిగి నలగారుచుండెను. అంతనొక తరి కర్దముండు కరుణాన్వితుండై జేడియచెంత నిలుచుండి యిటనెను. ప్రియకాంతా; చిరకాల శుశ్రూష కలితవై బక్కచిక్కియున్నావు. చిక్కిననూ చక్కని చుక్కవలె నా మనంబును ఆకర్షించితివి. నీ యభిమతంబు తీర్చెదను. సందియమందకుము అని కర్దముండు పలికిన ఎడలేని సిబ్బితయై తలవంచుకొని బొటనవ్రేలు నేలరాయుచు వివాహకాలపు తన రూపును యిప్పటి తనరూపును దలంచుకొని వ్యాకులితయయ్యెను. తోడనే కర్దముండు చేడియ తలంపెరింగి యింతిని పొంతనున్న నదియందు గ్రుంకులిడమనెను. ఆమె అట్లు చేయిచుండ సుందరవదనలగు సహస్ర కన్యకామణులు నదియందు పొడగట్టి దేవీ! నీపంపు చేయుదుము నీకై కర్దమునివలన సృజింపబడితిమనిరి. అంత దేవహూతి దరహసితవదనయై వల్లెయనెను. చేడియలు దేవహూతికి అభ్యంగనాదులు గావించి కురులు తడియొత్తి పట్టుపుట్టంబులు కట్టనిచ్చి ఆభరణ భూషితంజేసి నుదుట తిలకాదులు దిద్ది గంధాను లేపనంబులు దేహంబునకలది సర్వాలంకార భూషితను గావించిరి. ఆమె రూపమును ఆమె కనుంగొనుటకు దర్పణంబు గొనివచ్చి ముందట నిల్పిరి. ముద్దియ తన రూపమునకు తానె మురిసిపోయెను. అంతకుమున్న నాధుని సంకల్పబలంబున త్రుటిలో హేమకవాట మణిమయ సౌధంబులు నందనోద్యాన సదృశ సుందరవనచయంబులు మృదులములగు శయ్యాగారంబులు శుచికరంబులగు పచన గృహంబులు యివి యవి యననేల వర్ణించుటకు ఆదిశేషునకైనను అలవిగాని భోగార్హవస్తు జాలంబులు దాసదాసీ జనంబులు సమస్తంబు సృష్టించెను. తానును దివ్యభూషాంబరధరుడై దేవహూతి చెంగట నిలుచుండెను. అంతకుమున్న సిద్ధంబైయున్న కామగ విమానము పొడగట్టెను. నాధుని తపోవిభవరాశికి దేవహూతి లోలోన ఆనందాంబుధినోలలాడుచుండెను. చెంగట నిలుచుండిన నాధునిజూచి కడుంగడుసిగ్గందెను. వారిరువురి మనంబుల మరుండు సందడింపజేసెను. సంపదలు తపోధీనములనుటకు నిదర్శనమయ్యెను. కర్దముండు దేవహూతి కరంబును గైకొని విమానారూఢను జేసెను. సహస్ర కన్యకామణులతో విమానరూఢయై నాధునియంక తలంబలంకరించి సుమాకాంతయనం దగియుండెను. బహు స్వల్పకాలంబున సమస్త భూమండలంబు మహానదులు సముద్రంబులు శైలతలంబులు మహారణ్యంబులు యీశ్వరసృష్టియందలి వింతవిశేషంబు లరసి విమాన తలంబున గుడుచుటకు విశ్రాంతిగొనుటకు ననువగు స్థలంబుల సుఖంబనుభవించుచు స్వనిర్మితాశ్రమంబున కరుదెంచిరి. సకలసౌఖ్య కలితులై అతుల ఐశ్వర్యంబుల ననుభవింపుచు బహుకాలము నిమిషముల గడపిరి. భోజనశయన ఆసనంబుల నెడబాటెరుంగక పార్వతీ పరమేశ్వరులవలె దివ్యభోగంబులంబడసి తుదకు నవకన్యకామణులంగాంచిరి. పుత్రికల జననానంతరము కర్దముండు గతమున తాను నుడివిన ప్రకారము దేవహూతితో తపోవనంబున కేగెదననెను. అంత నామె చింతనొంది కూతులకు వివాహ మొనరింపక ఏగినవారలే వరుల నన్వేషింపవలసివచ్చును. అది

యనుసంగాక తత్త్వముపదేశించు పుత్రునొసంగవలయును. మహాత్మా! ఐహికాముష్మికముల కాధారము స్త్రీలకు సత్పురుషులైన భర్తలేగదా! రతి సంగతనై మిమ్ము సేవించుట విశేషంబుగాదు. మోక్షంబపేక్షించుటయే పరమ ధర్మము అనెను. అంత అశరీరవాణి యిట్లు పలికెను - శ్రీ మహావిష్ణువు మునులకు సాంఖ్యమతమును బోధించుటకు దేవహూతి కర్దములను సంతరించుటకు వారి గర్భంబున జనించగలడను వార్త నాలకించి సంతుష్టాంతరంగులై చెలంగిరి. దేవహూతి తన పూర్వస్వప్న వృత్తాంతంబు భర్త కెరింగించెను. కర్దముడు అంతకుమున్న భగవంతుని యానతిని దెల్పెను. ఇట్లు ఒండొరులు వ్రతధారులై ఈశ్వర జననకాలము నిరీక్షింపుచుండ నొక్క సుముహూర్తంబున శ్రీ మహావిష్ణువు దేవహూతికి జనించెను. సమస్త దిక్కులు తెలివొందెను. సముద్రంబు లుప్పొంగెను. మలయ వాయువులు వీచెను. మునీశ్వరుల గృహంబుల అగ్నులు దేదీప్యంబుగ వెలింగెను. దేవాంగనలు పుష్పవర్షంబులు గురిపించిరి. దేవహూతి కర్దముల కన్నులకు శంఖచక్రంబులు ధరించిన దివ్యరూపంబు కోటి సూర్యప్రభామండలంబై వెలుంగుచు గనంబడెను. తోడనె దేవహూతి శరీరమంతయు కన్నులుగలదై మ్రొక్కులిడుచు డగ్గుత్తికతో రోమాంచితయై నోట మాటరాక ఆనందాంబుధి దోగుచు అద్వైతయై అపార సౌఖ్యంబున నుండెను. కర్దముండు వందన శతంబులర్పించి వినతులు గావించెను. బ్రహ్మాదులరుదెంచి ప్రార్థనలు సల్పిరి. దేవహూతి కర్దముల కొనియాడిరి. అంత బ్రహ్మాదులు ఏగినతోడనే యీశ్వరుండు తొంటిరూపంబును సంహరించుకొని బాలుడై తల్లియొడిలో నేడ్చుచుండెను. విష్ణు మాయ లెరుంగ నెవరితరము!

అంతట బాలునకు జాతకర్మాదులు కర్దముండు గావించి నిండు మనంబున బాలుని రూపంబున నున్న జగదీశ్వరుని లాలన పాలనంబుల పెంచుచుండెను. అక్కపట బాలుండు శుక్లపక్ష చంద్రునిరీతి కర్దముని యింట బెరుగుచుండెను. కర్దముండు తన ముద్దు కూతుండ్ర తొమ్మండుగురిని వశిష్టాది మునీంద్ర నవకంబునకు వివాహమొనరించి వారికిందగినరీతి సత్కరించెను. వారును సంతోషమానసులై దారలందోడ్కొని కర్దమదంపతుల వలన ననుజ్ఞాతులై తమ తమ ఆశ్రమంబులకుంజని తమతమ జాయలవలన ప్రజాబాహుళ్యము గావించిరి. ఇదియే భగవత్సంకల్పము. భగవదాజ్ఞాబద్ధుడైన కర్దముండు అంతకుమున్న సంకెళులూడ్చుకొని అడవింజను మగదజంబురీతి సంసార బంధనలూడ్చుకొని పరుగులెత్త నుంకించుచుండెను. అంతనొక్క నాడు కర్దముండు కపిలుని ఏకాంత స్థలంబునకు గొనిపోయి ప్రదక్షిణ నమస్కారంబులు గావించి, దేవా! సకలమును నీయదియే భారము. నీవు లీలామానుషుండవు. జన్మకర్మంబులు నిన్నంటవు. జగదోద్ధారణ కొరకునూ, మమ్ములను తరింపజేయుటకునూ, మాగర్భంబున జనించి - మా కిహపరంబులకు దారిజూపితివి. దేవా! యిటుపై నేను తపోవనంబున కరిగి నీ యానతి పాలించెదను. భగవంతుడు దరహసిత వదనుండై అట్లకానిమ్మనెను. కర్దముండు దేవహూతి అనుజ్ఞగైకొని వెడలిపోయెను.

దేవహూతి పుత్రికల ఎడబాటునకుగాని, భర్త బాసిపోవుటకుగాని యించుకైననూ చలింపక తన భారమంతయూ తనకు పుత్రరూపంబుననున్న పరమేశ్వరునందు బెట్టెను. ఒక్కదినంబున పుత్రునుద్దేశించి యిట్లనెను. కుమారా! అసన్మార్గములైన యింద్రియ ఘర్షణలచే వసుధనిర్విణ్ణనైయున్న నాకే వెరవున శాంతి భద్రతలు చేకూరగలవో ఆనతిచ్చి నన్ను ధన్యతమురాలిని చేయవలయును. నీవు దక్క యొండు శరణ్యంబుగలదేయని పుత్రునడిగెను. పుత్రరూపంబున నున్న పరబ్రహ్మణ్యుండు యిట్లని పలికెను. అవ్వా! ఊరటగనుము. నీవు పరమభక్తురాలివి. నా ధ్యాన తత్పరవు గనుక నీకెట్టి కొరంతయు గలుగదు.

అనన్యాశ్చింతయంతో మాం।
యేజనా పర్యుపాసతే।
తేషాంనిత్యాభి యుక్తానాం।
యోగక్షేమం వహామ్యహం॥

అని చెప్పి సాంఖ్యతత్త్వమూ కర్మతంత్రము మున్నగు

నవియూ, పిండోత్పత్తియు జీవునిగర్భనరకాది అజ్ఞానావస్థలునూ బాల్యయౌవన కౌమార వార్ధక్యాది దురవస్థలునూ దెల్పుచూ తుదకు నాదగు నుత్తమంబగు భక్తియనెడి నావపైనెక్కి పయనించు జీవాత్మలు భవవార్ధి శీఘ్రంబున తరింపగలరు. నీవు మొదటి నుండియు నమ్మియున్న భక్తిభావంబు పదిలంబుగ బట్టుకొమ్ము తుదకు నన్ను జెందుదువని చెప్పి మాతృదేవతానుజ్ఞగైకొని లోకోద్ధరణ కొరకు వెడలి పోయెను. అంత దేవహూతి నష్టవత్సంబగు గోవు పగిది గన్పట్టెను. సకల భోగంబుల కాస్పదంబగు మాతాపిత్రాశ్రమంబును వీడి కపిలుండు సకలలోక వాసులచే పూజలుబడసి తన దివ్యసాంఖ్య మతంబును వ్యాప్తిగావించి అజ్ఞానుల గాఢాంధకార మడంప దలంచెను. కరుణాకలితుండగు భగవంతుడు దక్క నితరుండీపని చేయగలడా?

ఇచ్చట దేవహూతియు సమస్తవస్తు జాలంబులును, బంగరు మయంబులగు ఆసన భోజన శయనంబులను వర్జించి జటధారియై బిందుసరోవరంబుల త్రికాల స్నానమాచరింపుచు భగవంతుని భావబంధంబొనర్పుకొని బాహ్యాభ్యంతరంబుల మరచి తదేక ధ్యాన నిమగ్నయై పుత్రరూపంబున నున్న కపిలుని నారాయణ స్వరూపంబుగా నెంచి కన్నులు మూసినను తెరచినను అదియె రూపధారిణియై గురుభక్తియోగంబున అంబర తలంబునగకెసి హరియందు లీనమయ్యెను. అయ్యదియె దేవహూతి శిద్ధిబొందినచోటు. శిద్ధాశ్రమంబయ్యెను.

# పవనసందేశము

శ్రీమతి గంటి కృష్ణవేణమ్మ

(ఫిబ్రవరి తరువాయి)



రాకా చంద్ర జ్యోత్స్నల-నేకాంత స్థలము లందభీష్టంబిడి ; యెం
తో కూరిమి గలసిమెలసి - యీ కరణి నిరాదరంబిదేటికిఁ గృష్ణా!

తిలకము దిద్ది నా నొసటఁ దీరుగ నున్నదె ; చూడుమంచు నీ
సులలితమైన చెక్కులను జూపి ; కవుంగిట గ్రుచ్చి కేల నా
యలకల నల్ల ద్రోయుచు ; ప్రియంబున ముచ్చటలెన్నొ జెప్పుచున్
మెలగిన నాటి కూర్మి ; యొక మించుగ మాయము జెందె నేఁటికిన్.

నిరతము కన్ను మూసికొని నీ సుకుమార తనూ విలాసమున్
సురుచిర హాసరోచులను జూతునుగాని యెఱుంగ నన్యమున్
మరువకుమోయి సామి నను ; మామక హృత్కమలమ్ము భక్తి నీ
చరణ తలంబు నందునిచి సన్నుతి జేసెడిదాన నెప్పుడున్.

మురళివాయించి విడిచిన ముఖ్యగాన-రసము లేరీతి వెనువెంట మసలుచుండు
నటులె నీసుందరాకృతి నరయకున్న-ప్రేమభావంబు మనమున విడిసియుండు.

విశ్వమోహన మూర్తి నిన్ విడచి ; యొంటి - దివసగణనంబు చేయుచుఁ
దిరుగుచుంటి

పరమ శీతల కోమల బాహుయుగ్మ-ములను బంధింప వేని యెట్టుల భరింతు.

మనమును ; తనువును ప్రాణం-బును నీ కర్పణమొనర్చి ముప్పొద్దునినున్
గనుచును నా భాగ్యము నీ-వని గర్వము నొందుచుంటి నపురా! కృష్ణా!

మందార కుసుమ గంధమ-మందా నందమున గ్రోలు మధుకర మెపుడున్
డెందమున నిచ్చగించునె. యెందైనన్ గాంచనంబు నెఱుంగవె కృష్ణా!

సరసా లోకనములచే-దరహాస విలాసలాలిత వదనమున వా
గ్వర నవ్యమధు సుధారల-హరియించితిగాదె ; చాల హాళి మామనముల్.

చక్కనివాఁడవు ; ధరపై-రెక్కిన మానిసి ; వుదాత్త హృదయుఁడ వెపుడున్
నిక్కపు దాసలఁ గాచుట-కక్కట నీకింత భారమయ్యెనె యిపుడున్.
క్రొమ్మావి తేనెలటు హృద-యమ్ము పొగయఁబలికి కూర్మియలరారంగన్
నిమ్మగఁ గౌఁగిట నిడి యో-కొమ్మా ! నిను విడువ నంటి ; కుటిలతగాదె.
ఓర్చెద నాకలి దగలకు-నోర్చెద పరదూషణాదు లుల్లము లోనన్
బేర్చిన విరహానలమెటు-లోర్చికొనగ నౌను ? దెల్పుముడురాజ ముఖా!
కనులు వమ్మయ్యె దేహమా ! కాలిపోయె-నిద్రకఱవాయెఁ బోవాయె
నిశలుగడచి
మొనసి మాటాడ దైన్యమై మూర్ఛవచ్చె-నిన్ను విడనాడి ప్రాణమే !
నిలువదయ్యె !

ప్రణవము నోంకారంబును-గణుతింపఁగ నీదు వేణుగాన రవమునన్
నణువున బ్రహ్మాండంబున-ఫణిశయనా : గాంతు హృదయ ఫలకమునందున్
మధురాపురమే ! నీ కతి-మధురంబై యుండనిమ్ము మము నిర్దయతన్
విధుర వ్యథాధుతమతిన్ సుధాధర ! వగలఁ-బొగులఁగ జొనుపుట తగవా ?
వినవా ! నా మొరలించుకఁ-గనవా ! ననుకూర్మితోడఁ గరుణానిధి నీ
కనువా ! యీ గతి సేచుట-చనవా యొక ముద్దుచాలు సారసనయనా!
మన మిరువుర మొక్కప్పుడు-నను వొప్పన్ బుష్పపొదల యందనురాగం
బున దేలి యాడు వేళల-ననుగని యేమంటి ? కృష్ణనాఁడె మరచితే!
అలనాడటు వెన్నెలలో-గలువల చెలికాని సాక్షిగాఁజూపి మదిన్
వలపు గలయట్టులెన్నో-బలికితి ; వవి సత్యమనుచు భ్రమిసితిఁ గృష్ణా!
మంచివాఁడవంచు మదినెంచి నీకు నా తనువు, మనమునెల్ల ధారబోసి
కొంటిగాని యింత కొంచెగాఁడవటంచు-నెంచనైతిఁగృష్ణ యించుకేని.
కలవాణి మృదుపాణి యలివేణి యని పెక్కు-విధముల నోరారఁ బిలచునాఁడు
నీయాన నోచాన నీయానతిని దాఁటి-యడుగైన నిడనంచు ననిననాఁడు
నల జక్కవల జక్కివల పెక్కుఁ గనుగొంచు-బిగియార గౌఁగిఁట బెనఁచునాఁడు
నినుఁబాయనని బాసలన్ను జేసి కరమునఁ-గరమిడి సత్యంబు నెరపునాఁడు

మైమఱచి ప్రణయరస సమాధియందు-మునిఁగి పరవశనై నీదు మోముదక్క-
నన్యమెఱుఁగక సంతతా నందజలధిఁ-దేలియాడితి నీ తీరు దెలియదయ్యె!
అలనాఁటి చేఁతలిప్పుడు-కలలోనన్నికుఁ దోఁచఁగాఁ బోవాక్కొ-
తలఁపునకైనను రావో ? – వలచుచు ! వలపించినట్టివాఁడవుగావే.
తొడఁపైఁ దలనిడి కూరిమి-నొడలెఱుఁగక నిదురఁబోవునువిధ శిరంబున్
బెడిదపుఁ గరవారాహతి-నడచుట బల్ మగతనంబె ఔరా కృష్ణా!
పుండరీకనయన పొలుపొందు నీ మోము-దక్క యన్యమెపుడుఁదలఁప మదిని
పెట్టెలోని నగలె ? యెట్టులేఁ జూపుదు-మనసునకునుసాక్షి మనసెగాదె.
తల్లియుఁ దండ్రియుఁ బ్రియమే-వల్లభుఁడవు నీవయనుచుఁ బాయక నిను నా
యుల్లమున దలఁచి కొలిచితిఁ-గల్లయె ? సత్యంబొ ? తెలియఁగావలె నీకే.
నీ నగుమోమొక నిముసము-కానఁగ రాకుండనేని కమలదళాక్షా
నేనిక జీవింపను ; నీ-యాన సుమీ ! వేయి మాటలన నేమిటికిన్.
తగునే నిర్దయ ; నాపై-నగరే ? సరివారువిన్న నాయంబగునే
మగువల నారడి సేయుట-మగతనమే ! కొంటెతనము మానగరాదె.
లలితములగు నీ పలుకులు-చెలువగు నీ నవ్య దివ్య శృంగారంబున్
దులలేని వేణురవమును-దొలుకాడెడి హృదయవీధి దొలఁగక కృష్ణా!
బృందావనమున గోకుల-బృందంబును గాచువేళఁ బీతాంబర నీ
సుందర వదనముగని యా-నందంబునఁ గన్నుమోడ్తు నయతత్యనిధీ !

(క్ష మా ప ణ)

కాచితివి ప్రభు విధంబున-బ్రోచితి నాపదలయందు భూరికరుణచేఁ
దోఁచితివి నా మనోంబుజ మేచుట తగవౌనె ? యిప్పుడింత కఠినతన్॥
నవనీత సమానంబును-నవపల్లవ కోమలంబు ; నాథు హృదయమే
నవివేకను నినుదూరితిఁ-బ్రవిమల హృదయా ! క్షమింపు ప్రార్థింతుహరీ॥
కరములుమోడ్చి వచించెదఁ-గరుణాకర కృష్ణలోక కల్యాణగుణా
కరసురుచిర మురళీధర ! – సరసగుణా రాధతప్పు క్షమియింపఁగదే.

(సశేషము)

# సంబంధం కుదిరింది

శ్రీమతి జి. రాఘవమ్మ

(ఎండాకాలం. వేడిగాలి. రాఘవయ్య తారు రోడ్డుమీద నడుస్తున్నాడు.)

రాఘవయ్య:-ఇస్ అబ్బా! ఎండ ఏం ఎండ - నా కోసమేలాగుంది, మండిపోతున్నది.

పిల్లవాడు:-బాబయ్యా! బాబయ్యగోరు!

రాఘ:-(విసుగ్గా) ఏం?

పిల్ల:-చెప్పులు బాగుచేస్తాను బాబయ్యగోరు — చినిగి పోయుండాయి.

రాఘ:-(గాభరాగా) చెప్పులా? అవును చినిగినయ్ (స్వగతం) ఇవి ఈ పనిలో నాలుగోజత, గూడలు కూడ చినిగినయ్. నాలుగోజత-నాలుగేండ్లు ఎంత తిరుగుడు! ఎంతడబ్బు!

పిల్ల: ఏం బాబయ్యగోరు. ఇడవండి. ఒకణాడబ్బులు చాలు. సంవత్సరముండాల.

రాఘ:-(తేరుకొని) సంవత్సరమా! సరే బాగాకుట్టు.

పిల్ల:-(టక్ టక్) ఇవిగో బాబయ్యా! బాబయ్య గోరు ఏందాలోసిత్తుండారు. డబ్బులెక్కువనా?

రాఘ:-లేదు లేదు. ఇటువెయ్. ఇందణా తీసుకో.

పిల్ల:-ధర్మపెభువులు. ఇదే తొలిబోణి.

రాఘ:-ధర్మప్రభువులు! ఈ కాలంలో అణాకో ధర్మప్రభువు. నాకు ధర్మం చేసేదెవరు? ఈ ఎండలో చెప్పులు బాగుచేసినవాడివి నువ్వే ప్రభువునాకు.

(రంగమ్మ పనిలో ఉంటుంది.)

రాఘ:-అమ్మాయ్! అమ్మాయ్! తలుపు (తలుపు కొట్టిన చప్పుడు)

... ...

ఏయ్. తలుపు. తలుపు. (కొట్టిన చప్పుడు)

రంగమ్మ:-(లోపలినుంచి) వస్తున్నా. వస్తున్నా. (వస్తూ) చెయ్యి కడుక్కొనివచ్చే యింతలోనే ఎందుకండి అలా బాదుకుంటారు. (తలుపుతీస్తుంది)

రాఘ:-బాదుకుంటున్నాను. తలుపూ, తలాకూడ

రంగ:-నేనేమన్నానని అంత కోప్పడుతారు. లేచి స్నానంచెయ్యండి. భోంచేస్తేగాని మీకా చికాకు తగ్గదు.

రాఘ:-ఆహా! కనిపెట్టావు. మానసిక శాస్త్రవేత్తవు!

రంగ:-నేనేమాతాలెండి-లేవండి. తర్వాత మాట్లాడుకుందాం.

రాఘ:-అమ్మాయేది?

రంగ:-ఇవ్వాళ ఏదోక్లాసుందట. రెండింటికి వస్తానని వెళ్లింది?

రాఘ:-ఆ క్లాసు. ఈ క్లాసులే నా ఊపిరి తీస్తున్నాయ్.

రంగ: చదివితే ఏంతప్పండీ? వాండ్ల పిల్లలంతా చదువుకోడంలా? మనమ్మాయికేమన్నా జీతమా భత్యమా!

రాఘ:-అది లేకపోవటం మరీ చిక్కు. అందువల్లే చదివించాల్సొచ్చింది. అయినా యీడొచ్చిన పిల్లను ఎన్నాళ్లు ఇంట్లో పెట్టుకుందాం?

రంగ:-అప్పణ్ణించి చూస్తూనే ఉంటిరిగా? కుదిరితే నే వద్దన్నానా?

రాఘ:-కుదిరితే నువ్వొద్దంటే నే ఊరుకుంటానా?

రంగ:-లేవండి పన్నెండైంది. సరేగాని యివాళటి పని కాయా? పండా?

రాఘ:-కాయాకాదు. పండూగాదు. దోర.

రంగ: కొద్దికాలానికి పండుతుంది లెండి-

రాఘు:-పండమండ ముదిరేట్టుంది -

రంగ:-అసలు సంగతేంటో చెప్పండి.

రాఘు:-పిల్లవాడు అంతచక్కనివాడుకాడు. అనాకారికాదులే. ఇంటర్ వరకు చదివాడు. కలెక్టరాఫీసు గుమస్తాపని చేస్తున్నాడు.

రంగ:-ఇంటరంటే బియ్యే పైదా కిందదా?

రాఘు:-కిందదే. నల్లగాఉంటాడు పిల్లవాడు.

రంగ:-రంగేం కాచుకతాగుతామటండీ! కట్నమెంత డిగారు.

రాఘువ:-మనం తిరుపతి పోవడానికి సరిపోయినంతగా అడిగారు.

రంగ:-అబ్బే. వేళాకోళాలం మానండి. అసలు ఎంతడిగారో చెప్పండి.

రాఘు:-మనం యివ్వలేనంత?

రంగ:-అంటే ఎన్ని వేలండి?

రాఘు:-మార్కెటులో ఆయన ధర నాలుగువేలట. ఇంకొక వెయ్యి బ్లాను కావాలట. వెరసి ఐదు వేలు.

రంగ:-అయిదువేలే. అయినట్టే.

రాఘు:-ఇంకాఉంది.

రంగ:-ఏంటది?

రాఘు:-ముగ్గురాడబిడ్డలకు మూడువందలు. పిల్లవాడికి రిస్టువాచి, సైకిలు. వెండికంచం, గ్లాసు.

రంగ:-ఇంకా - ఆపారేం!

రాఘు:-ఇంకా ఉన్నది.

రంగ:-ఇంకా ఉంది. ఈ సంబంధం ఒద్దులేనాయనో— అదేంది?

రాఘు:-అమ్మాయి చదువుకు స్వస్తి చెప్పాలె.

రంగ:-అదేమొచ్చింది అడ్డం?

రాఘు:-పిల్ల స్కూలుఫైనలు చదువుతున్నదనగానే పిల్లవాడితండ్రి నోరుతెరిచాడు.

రంగ:-మరి పిల్లవాడేమన్నాడండీ!

రాఘు:-ఏమనలేదుగాని, శరీరంమాత్రం చెమటబట్టినట్టు తోస్తుంది.

రంగ:-బాగానేఉందిగాని లేవండి. అన్నం తిందురుగాని. సరేగాని పిల్లవాడికి తల్లిఉన్నదాండి?

రాఘు:-సలక్షణంగా ఉన్నది, బిడ్డల్నుగంటూ.

రంగ:-ఇదుగో తుండుగుడ్డ. లేవండి. ఏమండీ! వాండ్లను పిల్లను చూడ్డానికి రమ్మన్నారా?

రాఘు:-వస్తారు. ఎల్లుండి, సోమవారంనాడు.

రంగ:-తప్పక వస్తారా?

రాఘు:-వస్తారుకాని ఆ పదకొండుకు యిది పన్నెండోది అవుతుంది.

రంగ:-అట్లాయితే ఎట్లాగండీ. ఏదో చెయ్యాలిగాని.

రాఘు:-ఏంచేయాలి. ఆ కాలేజీలనిండా తొక్కితే ఉబుకుతున్నారు పిల్లవాండ్లు. పెండ్లిపేరు చెపితే ఏమౌతారో తెలీదు. ఈ బాధ-

రంగ:చాల్లె ఊరుకోండి, నేంజెప్పలా—భోంచేస్తేగాని కుదుటపడరని.

రాఘు:- లేవనిస్తేగా?

రంగ: నేనేంచేశాను. లేవమని యిందాకటినుంచి మొత్తుకుంటుంటే.

రాఘు:-ప్రశ్నమీద ప్రశ్న వేస్తూనే ఉంటివి.

రంగ: అంతేలే. నేనులోకువ మీకు. లేవండి — (చెప్పులు తీస్తూ) చెప్పులు బాగుచేయించారల్లే ఉందే?

రాఘు:-అవును బాగుచేయించాను. నాలుగేండ్లు - నాలుగో జత నాలుగేండ్లకష్టం-బాధ. పద పోదాం.

(వీరన్న పంతులు_కొడుకు సత్యం)

వీరన్న:- ఏరా అబ్బాయ్. వెళదామా యివాళ బెజవాడకు.

సత్యం:-ఎందుకు నాన్నా?

వీరన్న:-ఎందుకేమిటి? పిల్లనుచూడ్డానికి.

సత్యం:_ఇది కుదిరేదేనా?

వీరన్న:-ఎందుకని?

సత్యం:-మీవరాలు వాండ్లు యివ్వగలరా అని.

వీరన్న:-ఏంరోయి వేళాకోళంగాఉందే నీపని.

సత్యం:-కాదులేనాన్నా! నేనో గంగిరెద్దుని. నీవు బూరగ ఊదుతుంటే నేను తలఊపుతుంటా.

వీరన్న:-(నెమ్మదిగా)నీమంచికే కాదట్రా యిదంతా?

సత్యం:-అవునవును. నామంచికే. ఇక నేనత్తగారింటికి పోనవసరంలేదు.

వీరన్న:-ఎందుకని?

సత్యం:-మీకిచ్చే కట్నంతోటి వాండ్ల కాపురానికి తిలోదకాలు. ఇక నే పొయ్యేదెక్కడికి?

వీరన్న:-నాకిచ్చే కట్నమేంటి? వేదాంతంలో పడ్డదే వ్యవహారం.

సత్యం:-కట్నం నాక్కాదుగా?

వీరన్న:-తండ్రికి ఆ మాత్రం బాధ్యత లేదంటావు!

సత్యం:-ఉన్నది. ఉన్నది. ఆరేడుసార్లు పిల్లను చూడ్డానికి తీసుకపోవడానికి. అవన్నీ ఎందుకుచెడినయ్. కట్నంకోసమేగా?

వీరన్న:-మరైతే ఏమిటి సువనేది? పోదామా_వద్దా?

సత్యం:-పోదాం. నేను కాదనలేదు. కాని యీ సంబంధం తప్పిపోతే ఇక జన్మలో పిల్లను చూడడానికి రాను. పెండ్లిచేసుకోను.

వీరన్న:-పిల్లవాజమ్మా! పిల్ల బాగుండకపోతే?

సత్యం:-అయినా ఫరవాలేదు.

వీరన్న:_అట్లాఅయితే ఈ సంబంధం వదులుకుందాంలే. పోవద్దు.

సత్యం:_నేపోయివస్తాను పిల్లను చూడ్డానికి.

వీరన్న: నీతోటి చావొచ్చిందే. నేనూవస్తా పద పోదాం —.

: రాఘవయ్య యిల్లు :

సావిత్రి: బయట నిలువబడి సరళా! సరళా!

సరళ:_(బయటికివచ్చి) అక్కడ నిల్చున్నావేం? లోపలికిరా సావిత్రీ.

సావిత్రి: (లోపలికివస్తూ) ఇవాళేదో మీ యింట్లో Extra గా వుందే.

సరళ: ఆ. ఏముంది? ఎప్పటిదంతే. ఎవరో వస్తారట చూడ్డానికి.

సావిత్రి:_ఎప్పుడట? మరి చెప్పలేదే నిన్న.

సరళ:_(దీనంగా) ఏం జెప్పమంటావు. ఎన్నిగాలే దిట్లాంటివి.

సావిత్రి:_తొందరగా ఉన్నట్లుందే? అవునులే ఎప్పటికైనా తప్పేదా? నేవస్తా.

సరళ:_ఎక్కడికంత తొందర?

సావిత్రి:- మావారీదినం సినిమాకెళదామన్నారు. నీవు కూడా వస్తావేమోనని వచ్చాను.

సరళ:-మీవారా? నేనెందుకు మధ్య.

సావిత్రి:_ నాకు తెలుసులే. తోటిదాన్ని భర్తతో కులుకుతుంటే నీకెంత బాధ మనసులో.

సరళ:-ఛీ. అవేంమాటలు. నాకేంబాధ?

సావిత్రి:_పిచ్చి, నీకేగాదు ఆ బాధ. అందరాడవాండ్లు అనుభవించేదే. నీవేం ప్రకృతికి మించిందానివా? అదంతా ఎందుకుగాని, సినిమాకు వస్తావా?

సరళ:_నీవుకూడా ఉండు. ఆ ముఖంచూచి ఇద్దరం వెళ్ళుదాం త్వరగా. మానాన్న ముఖంచూడు ఎంత అదుర్దాగా ఉన్నదో! ఆయనకెందుకో అంతబాధ?

సావిత్రి:_ఆ బాధ మనకు తెలియదింకా? తండ్రులకు ఒక్కొక్క ఆడపిల్ల ఒక్కొక్క యాటంబాంబుతో సమానం.

రంగమ్మ:-లోపలినుంచి సరళా! సరళా! సావిత్రిటే. రా రాఅమ్మా! సావిత్రీ రా!

(రాఘవయ్య--రంగమ్మ—సరళ—సావిత్రి ముందు హాల్లో వీరన్న పంతులు వాండ్లకోసం ఎదురు చూస్తుంటారు.)

రాఘు:_ఏందో ఇంతవరకూ రాలేదే. మూడింటికే వస్తామన్నారు.

రంగ:_ఏమంత తొందర! కుదిరేదా? అఘోరించేదా?

సరళ:_నే చెప్పులా సావిత్రీ. ఇదొకతంతు నెలకో సారి రెండుసార్లు.

సావిత్రి:_ఏం పిన్నమ్మా! ఎందుకని కుదరదు?

సరళ:_వాండ్ల హిరణ్యాక్షవరాలు వీరు తీర్చలేక.

సావిత్రి:_అంత పెద్దవరాలేం?

రాఘు:_కాదులే _ అయిదువేలూ, మూడువందలు, సైకిలు, రిస్టువాచి, వెండికంచం, గ్లాసు.

సావిత్రి:_కొంచమేనే. దీంతో సరళ M. B. B. S. దాకా చదువవొచ్చు.

రంగ:_అదే బాగుండేట్టున్నది.

సావిత్రి:_ఇంత ఆశపోతుల్ని ఊరకపంపితే కొంచెం శాంతిజేసిపంపితే బాగుండేట్టున్నది.

రంగ:_అబ్బే ఊరకుందూ తల్లి. నీకు జవాబుచెప్పే వాండ్లెవరు?

సావిత్రి:-కాదులే పిన్నమ్మా! కుదిరేదికానప్పుడు మనమేంచేస్తే యేం! ఇంకోచోటన్నా కాస్త బుద్ధిగల్గి ప్రవర్తిస్తారు. ఎంతమందివస్తారో?

రాఘు:-అబ్బా, కొడుకు యిద్దరు.

సావిత్రి:_సరేగాని బాబోయ్! ఆ కట్నమిచ్చి పెండ్లిచేస్తావా?

సరళ:_ఇక వాండ్లు ఊరిమీదికి పోవలసిందే. నే జేసుకోను. నా కవసరంలేదు.

రాఘు:_ఏంది సరళా?

సరళ:_ నేనేం పసిదాన్నికాదు. నాకు తెలుసు. ఇంతకట్నంపోసి ఈ సంబంధం నా కవసరంలేదు.

రంగ:-అదేంటే ఆ మాటలు.

సరళ:-అదేంటే అంటే తర్వాతేంజేస్తావే, నాన్న రెండుసంవత్సరాల్లో రిటైరుగాబోతున్నాడు. లీల పెండ్లి ఎట్లాచేస్తావు.

రంగ:_ఏమోనమ్మా మీదంతా వేదాంతం. కాని వాండ్లను గలభా చెయ్యబోకండి.

రాఘు:-ఈ సంబంధం కుదిరేదికాదని నేనిదివరకే అనుకున్నాను. పిల్లవాడుకూడ నాకాట్టే నచ్చలేదు.

సావిత్రి.-ఇంకేం సరే కూర్చోవే. వీండ్ల ఇత్తా తేల్చుకుందాం.

రాఘు:_చదువుకున్న ఆడపిల్లలంటే ఇందుకే జనానికి భయం. మా తల్లులు మీరేమీ మాట్లాడకుండ వాండ్లను పోనివ్వండి. (గాభరాగా) అదుగో గుఱ్ఱబ్బండి (గుఱ్ఱపుబండి వచ్చి ఆగిన ధ్వని)

(వీరన్న పంతులు-సత్యం దిగుతారు.)

వీరన్న:-సత్యం నీవేమీ మాట్లాడకు.

రాఘు:-రాండి రాండి. మీ కోసమే ఎదురు చూస్తున్నాం.

వీరన్న:_ఏందోనండి_వెధవబండి లేటైంది.

రాఘు:-అవును. అప్పుడే నాలుగైంది. దయచెయ్యండి. కాఫీ తీసుకుందాం.

వీరన్న:-అబ్బే. తాగివచ్చామండీ. ఇప్పుడవసరంలేదు.

రాఘు:_ఫరవాలేదు. (గ్లాసులందించి తానొకటి తీసుకొంటాడు)

సత్యం:-నా కలవాటు లేదండి.

రాఘు:-ఏంనాయనా నిజంగా అదృష్టవంతుడివి.

వీరన్న:—అమ్మాయిని తీసుకరమ్మనండి. మాకు మళ్ళా బండికి టైమవుతుంది.

రాఘు:-సరిసరే. అమ్మాయ్ సావిత్రీ, సరళను రమ్మను.

(సరళ సావిత్రి ప్రవేశం)

రాఘు:-ఈమె మా వదినకూతురు సావిత్రి. ఆమె నాకూతురు సరళ.

సావిత్రి:—నమస్కారమండీ.

వీరన్న:—కూర్చోండమ్మా! ఈ అమ్మాయి బాగా చదువుకున్నట్టుందే.

రాఘు:—అవునండీ. ఆ అమ్మాయి బి. యే. పాసయింది.

వీరన్న:— బియ్యేదాక చదివిందీ. ప్రస్తుతం ...........

సావిత్రి:— భర్తకు వంటజేసి పెడుతున్నాను. భయ పడకండి.

వీరన్న:—పెద్దగా చెప్పావు. ఆడవాండ్లు అంతకన్నా చేసేదేముంది లేండి.

సావిత్రి:—ఆడవాండ్లకు చదువంటే తమకమితభయంగా ఉన్నట్లుందే.

వీరన్న:—ఆ భయమేముందిగాని. కొంచెం కంటికి తగిలే పుల్లలు, సరేగాని అమ్మాయికి సంగీతమేమన్నా వచ్చా?

సావిత్రి:—వచ్చండీ. తమరు సినిమాపాటలు వింటారా! త్యాగరాజ కృతులు కావాలా?

వీరన్న:—(గాభరాగా) ఆ. ఆ. సినిమాపాట లెందుకు? ఒక కృతి పాడమనండి.

సావిత్రి:—మీ అబ్బాయిగారికి సంగీతంవచ్చా? (ఆగి) మీకువచ్చా? (ఆగి) రాదుగా మరెందుకు.

సత్యం:—అబ్బాయి సంగతెందుకు? మీ సంభాషణ తేలనివ్వండి గట్టి ఓడు తెలుస్తుంది. (నవ్వుతాడు)

వీరన్న:—మీరు మమ్మల్ని పరీక్ష చేస్తున్నట్టున్నా రే?

సావిత్రి:—మరి మంచిచెడ్డలు తెలుసుకోవద్దూ!

వీరన్న:—మీ పద్ధతి నాకేమీ నచ్చలేదు?

సావిత్రి:—అకేమంత విశేషం కాదులెండి. సరళా ఇక లోపలికిపో. అబ్బో అప్పుడే నవ్వుతున్నావే?

వీరన్న:— నే నమ్మాయిని బాగా చూడలేదు.

సావిత్రి:—పెండ్లికొడుకు చూచాడులెండి. మీరు చూచినా ఒకటే, చూడకపోయినా ఒకటే. ఇక కట్నం విషయం మా బాబాయిగారు రెండు వేల కంటే ఎక్కువ యివ్వలేమంటున్నారండీ.

వీరన్న:—రెండు వేలా! ఐదువేలకూ రెండు వేలకు సంబంధమెక్కడ?

సావిత్రి:—సంబంధం లేకేమిటండీ. అయిదు వేలల్లో మూడు వేలు తీసేస్తే రెండు వేలు. రెంటికి మూడు కలిపితే అయిదు.

వీరన్న:-ఏం రాఘవయ్యగారు. మమ్మల్నమర్యాద చెయ్యడానికేనా పిల్చింది.

సావిత్రి:అమర్యాదా? నా మాటల్లో అమర్యాద వాక్యాలేవైనా ఉన్నయ్యా తెల్పండి—సరేగాని మొన్న పెండ్లిచేసిన తమ చిన్నకూతురికి ఎంత కట్నం యిచ్చారండీ?

వీరన్న:— అది నా స్వవిషయం.

సావిత్రి:—ఇది మా స్వవిషయం కాబట్టే మనవిజేసుకుంటున్నాను. మీ స్వవిషయమంతా నాకు తెలుసు లేండి.

వీరన్న:—హద్దుమీరుతున్నది వ్యవహారం. (కోపంతో)

సావిత్రి:—ఫరవాలేదులెండి. మనం కొట్టుకోవడం లేదుగా? ఒకజీవితానికి సంబంధించిన విషయాలు గట్టిగా సెటిల్ చేసుకుంటున్నాము.

వీరన్న:-ఇది కుదిరే వ్యవహారంకాదు. చివర విషయం రాఘవయ్యగారు లాంఛనాలతోకూడ ఐదువేలియ్యండి.

సావిత్రి:—సరే. ఇంకెందుకా ఆఖరుసంగతి. లాంఛనాలతోగూడ రెండువేల అయిదువందలిస్తాం. బేరం ఫైసలా చేసుకొని వెళ్ళండి.

వీరన్న:—ఏమిటా మాటలు. బేరానికిఏం ఎద్దులా, దూడలా.

సావిత్రి:—నా దృష్టిలో అంతే.

వీరన్న:-(కోపంగా అరుస్తాడు) ఛీ! పశువుల్లాగున్నారు-మర్యాదహీనులు-నన్న గౌరవపరుస్తారా? చాలింక—వెళ్లుదాం లేరా. కుర్చీలో ఆ విధంగా పశువులాగ కూచుంటావేం — మనకీ సంబంధం అవసరం లేదు—

(సత్యం లేస్తాడు—వీరన్న పంతులు ఒక్క—దూకున జట్కాలోకి వెళ్ళుతాడు.

(నెమ్మదిగా - వినయంగా)

సావిత్రి—Mr. సత్యం. ఒక చిన్నమాట.

(ఒక నిముషం ఇద్దరు మాట్లాడుతారు) (గుసగుసలు)

సత్యం:—మీరా? Good bye - మీ సంభాషణ రికార్డుచేస్తే బాగుండేది (పెద్దగా నవ్వుతారు.)

వీరన్న:—(జట్కాలోనుండి) రావేంరా యింకా ...

సత్యం:—వస్తాను. మామగారూ, నమస్కారం.

(జట్కా కదలిన చప్పుడు)

(సరళ ఇంటిలోనుంచి పకపక నవ్వుతూ వస్తుంది)

సరళ:—చాల బాగుంది, ఈ సంబంధం, మళ్ళీ ఇంకో చోటికి పిల్లను చూడడానికిపోరు ఈ జన్మలో.

సావిత్రి:—ఇక పోనవసరంలేదుగా?

సరళ:—ఎందుకనీ?

సావిత్రి:—అది అంతేలే.

రాఘు:—ఏంది సావిత్రీ! ఇంతపనిజరిగి వాండ్లు మన సంబంధం చేసుకుంటారా?

సావిత్రి:—చేసుకుంటారు, తప్పకుండా? పిల్లవాడు చాల మంచివాడుగా కన్పడుతాడు. ఇన్ని మాటలకు నా దవడలు వాయిస్తాడనుకున్నా. కాని నవ్వుతూ కూర్చున్నాడు.

రాఘు:—దాని అర్థం.

సావిత్రి:—పిల్లను చేసుకోడాని కిష్టపడ్డాడనే.

రంగ:—అయినా ఇంటికివచ్చిన వాండ్లను అట్లా సాగనంపితే ఇంకేమైనా ఉందా?

రాఘు:—పోయేటప్పుడేమిటి మాట్లాడావు.

సావిత్రి:—దానుడి తప్పులు దండంతో సరి. క్షమాపణ చెప్పుకున్నాను. ఇంతకీ అయితే అవుతుంది లేకపోతేలేదు. సినిమాకు పోదాంరావే (వెళ్తారు)

(వీరన్న పంతులు - ఇల్లు)

వీరన్న:—చూచావా! ఎంత అమర్యాద. ఆడపిల్లనలా వదలివేసి, ఉసిగొల్పుతాడు.

సత్యం:—వాండ్లేంచేశారు. ఉన్న సంగతి అడిగిందామె.

వీరన్న:—అన్ని మాటలా పుట్టింది మాట్లాడుతుంటే బెల్లంకొట్టినరాయిలా - ఏం అభిమానమా?

సత్యం:—ఆగండి. మీరే మాట్లాడవద్దన్నారు.

వీరన్న:—సంబంధంట సంబంధం. (కోపంగా) ఈ చదువులు చెప్పించి నాశనం జేస్తున్నారు ఆడపిల్లల్ని.

సత్యం:—అవును లే. ఉన్నమాటంటే మీపెద్దతనానికి దెబ్బతగిలింది. నిజంగా మన లీలకు ఎంత కట్నం యిచ్చారు? వెయ్యన్నరా? మీ తాహతు అంతేనా?

వీరన్న:—ఆ విషయం మాట్లాడడానికి నీ వెవరు?

సత్యం:—నా విషయంలో మీకెంత బాధ్యతుందో మీ బాధ్యతలో నాకు అంత భాగముంది.

వీరన్న:—ఇక పోట్లాట అనవసరం. నీ వ్యవహారం మీరిపోయింది. ఆ కరణంగారి సంబంధం సెటిల్ జేస్తాను - ఐదు వేలిస్తానన్నాడు.

సత్యం:—నాకవసరంలేదు, ఈ సంబంధమే కుదుర్చండి. లేకపోతే నాకసలు పెండ్లేవద్దు.

వీరన్న:—ఇంత అవమానం జరిగినా ఈ సంబంధమా? నీకు పిచ్చెత్తలేదుగదా?

సత్యం:—లేదు. ఈ సంబంధమే చేసుకుంటాను, రాసి వెయ్యండి.

వీరన్న:—నాకవసరంలేదు, నీవే జేసుకో.

సత్యం:—అయితే నేనే వ్రాసేస్తాను.

వీరన్న:—నీవు నన్ను కష్టపెట్టబూనుకున్నావా ?

సత్యం:—లేదు - కాని ఒక విషయం, మీతో వాదించిన అమ్మాయి ఎవరో తెలుసా.

వీరన్న:—తెలీదు. ఎవరామె ?

సత్యం:—మనలీల ఆడబిడ్డ. లీల పెండ్లికిరాలేదు. అందువల్ల ఆమెను మన మెరుగం.

వీరన్న:—ఆ. నిజమా! అందువల్లే అంత ధైర్యంగా మాటలన్నది. నీ కెవరు చెప్పారు.

సత్యం:—ఆమే చెప్పింది. ఆఖరున క్షమాపణ చెప్పుకుంది.

వీరన్న:—బహు అఘాయిత్యపు పిల్లలాగుందే ?

సత్యం:—చదువుకున్నది. అంత ధైర్యం చదువుకున్నా ఆడవాండ్లలో అరుదు.

వీరన్న:—అయితే సంబంధం కలిసిందేనన్నమాట.

సత్యం:—అవును.

వీరన్న:—సరే. కాని కట్నం నాకు నచ్చలేదు. నామర్దాగా ఉండేట్టుంది.

సత్యం:—ఫరవాలేదు, అసలు తీసుకోకుంటే ఆపేచీ లేదు.

వీరన్న:—అబ్బే ఖర్చులకన్నా వస్తుంది. వచ్చినమటుకే కానియ్.

సత్యం:—అయితే వ్రాసెయ్యండి. నే ఆఫీసుకు వెళుతున్నాను.

(రాఘవయ్య ఇల్లు)

పోస్టుజవాను:—ఏమండోయి రాఘవయ్యగారు, కవరు కవరు.

రాఘవయ్య:—వస్తున్నా. (చింపుతాడు)

రంగమ్మ:—ఏమిటండీ !

రాఘు:—చెబుతా. చదువనియ్యి.

రంగ:—ఆ సంబంధం సంగతేమో. నాలుగు చీవాట్లు పెడుతూ వ్రాసి ఉంటారు.

రాఘు:—(సంతోషంగా) కాదు కాదు. మన సంబంధానికి ఒప్పుకున్నారట. ఎల్లుండి ముహూర్తాలు పెట్టుకోవడానికి వస్తారట.

రంగ:—ఏమండీ ఏమిటిది ? నిజంగానా ? సరళా సావిత్రీ ! పైనున్నారు చెప్పివస్తాను, పిలుస్తాను. (పెద్దగా) సావిత్రీ ! సరళా!

సరళా-సావిత్రి:—వస్తున్నాం.

రాఘు:—అమ్మా, నా బాధ సగం తీరినట్లైంది. (సరళ-సావిత్రి ప్రవేశం) సావిత్రీ ! నీ జ్యోతిషం పూర్తయింది.

సావిత్రి:—ఏమైంది. సంబంధం ఒప్పుకున్నారా ?

రంగ:—ముహూర్తాలు పెట్టుకోడానికి వస్తారట, ఎల్లుండి.

సావిత్రి:—పిల్లవాడు అడ్డం తిరిగుంటాడు. వీరన్న పంతులు తల తిరిగుంటుంది. సరళేదీ - అప్పుడే వెళ్ళిందండోయ్.

రాఘు:—ఏందో సావిత్రీ ! ఈ సంబంధం కుదిరింది. నా బాధ ఈడేరినట్టేనమ్మా. ఆడపిల్లలున్నగన్న తండ్రులబాధ.

సావిత్రి:—"లావొక్కింతయు లేదు. ధైర్యము విలోలంబయ్యె" లాగుంటుంది బాబాయ్.

రాఘు:—నిజమమ్మా నిజం. ఈ నాలుగేండ్లనుంచి యమలోక బాధపడ్డాను. ఇక ఫరవాలేదు. - ఈ సంబంధం కుదిరింది.

———o———

'గేయకథ'

# ఎత్తుకు పై ఎత్తు

శ్రీమతి మునిపల్లె సరస్వతి



సింహాచలమను కొండచరియలో,
సింహాద్రీయను చెంచుబాలకుఁడు,
సంధ్యాసమయము జొరబడగానే,
సంద్రము దాపున జేరిసుఖించును –

ఆటలుపాటలె యాతనిసొత్తు,
అక్షరముక్కల నెరుగడువాఁడు,
అమ్మయు బాలునిబుద్ధినె మెచ్చు,
అతనికి 'నా'యనెయండయులేదు-

సింహాచలమున సిరిగలవాఁడగు,
సింగాయని యెడు దొంగలరేఁడు,
పొంచి పొంచి హరించును సొమ్ముల,
సంచులెన్ని యో పాతెను భూమిలో –

సుందర వన ప్రాంగణమున,
సింహాద్రి చింతించు చుండెను –
దొంగ సింగడా బాలునితో,
మంచి మాటలతో నిట్లనియన్ –

"బాలుడ! నీవేడ్చు చుంటివి,
బావిలో నీదేదైనపడినదా?
భారము నాదని ఎరిగివచింపుము,
భద్రము గానది తీసియిచ్చెదన్ –"

బాలుడు సంతస మొందియిట్లనెన్,
'బావా! నిజముగ బావిలోపల,
బారెడుపొడవునాముత్యాలహారం'
బావురుమనియెను చెప్పుచుతానె

దొంగలరాయుఁడు మనమున పొంగి,
అంగవస్త్రములు బాలునికొసగి,
చెంగున నూతిలో మున్గెను పాపము –
పొంగుచు బాలుఁడు పారిపోయెను,

వెదకి వెదకి వేసారెను సింగఁడు,
వెఱ్ఱిచూపులతో వొడ్డుచేరును,
వొడ్డున, బాలుడు, బట్టలులేమిచే,
ఉగ్రుడాయె నా దొంగసింగఁడు –

పరులను పరాభవించెడు సింగఁడు,
పరువుగ బ్రతుకదలంచెను వెంటనే,
పరులను పరాభవించెడువారికి
పరుల చేతిలో మోసముగల్గును –



# అభాగిని

శ్రీ ఆమంచర్ల మల్లికార్జునరావు

అది ఒక పెద్ద భవంతి. ముందువైపున చక్కని పూతోటవుండి ఆ భవంతికి శోభను చేకూరుస్తున్నాది. అది సాయం సమయం. భవంతిలోనికి అప్పుడేవచ్చి నిలిచింది ఒక కారు. సరిగా ఆ సమయానికి గదిలోని గోడగడియారం టంగ్, టంగ్ మంటూ ఆరు గంటలు కొట్టింది. అప్పటివరకు నర్సింగ్ హోంలో పనిచూచుకొని తిరిగివచ్చి, కారుదిగిన డాక్టర్ రామారావు ఇంటిలోపలికి వెళ్ళబోతుంటే, ఇంటి నౌకరు పెద్ద పెద్ద కేకలు పెట్టుతూ, గేటువద్ద ఎవరినో అదిలించి పొమ్మనడం వినిపించింది. రంగడు (నౌకరు) కేకలకు ఆవలివైపునవున్న వ్యక్తి లక్ష్యంచేసినట్లులేదు - ఆ వ్యక్తి దీనంగా "బాబూ! కానీ డబ్బులు దానంచేయండి! మీకు దణ్ణం 'బెడతాను" అని ప్రాధేయపడుతున్నది. యాచించే వ్యక్తి స్త్రీ అనే అనుమానంగలిగి డాక్టర్ సరాసరి గేటువద్దకు వెళ్ళాడు. గేటు కమ్మిల నానుకొని అందులోనుంచి చేతులుజాపి నిలబడివుంది ఒక స్త్రీ. గేటువైపువచ్చి డాక్టరు వైపుకు చెయ్యిజాపి "ధర్మం చేయండి బాబయ్యా! ఆకలితో అలమటించి పోతున్నాం. కలిగిన మహాత్ములు మీరే యింత దానధర్మంచేయాలి - లేకపోతే మాగతేంగాను - బ్రతకగలమా" అంది ఆ స్త్రీ. ఆమె కడుపిన్న వయసులోవుంది. వుంటే 20-22 సంవత్సరాల ప్రాయం వుండవచ్చు. బీదరికంవల్ల బక్క-చిక్కి-, కట్టుగుడ్డలు మాసిన పాత్తలతోవుంది. బీదరికం అనుభవిస్తున్నా, బక్కచిక్కినా, ఆమె మొహంలో ఒక రకమైన కళాకాంతులు శోభిస్తున్నాయి. డాక్టర్ ఆమెతో "దాన ధర్మాలకు ఎగబడక కష్టించి పనిచేసుకోలేకపోయావు - దిట్టంగా నేవున్నావే?" అని ప్రశ్న వేసాడు. సాధారణంగా అలాంటిప్రశ్న యాచించిన ప్రతి వ్యక్తికి, ఎదుటి వ్యక్తి దానంచేసినా లేకపోయినా ప్రశ్నించే మొదటి ప్రశ్న అదే.

కాని ఆమె డాక్టర్‌కు చక్కని సమాధానమిచ్చింది. "నిజం బాబూ! యాచించక బ్రతకాలి! కాని ఈ యాచనచేస్తూ జీవించడం నా కోసంకాదు! ఇటు చూడండి. అదిచూచి మీరేం చేయమన్నా చేస్తాను" అని ఆ స్త్రీ డాక్టర్‌కు తన వెనకవైపున ఒక దృశ్యాన్ని చూపింది. ఆ దృశ్యాన్ని చూచిన ఏ వ్యక్తిగూడా అతని జన్మలో ఆ దృశ్యాన్ని మరువలేడు. అష్టవంకరులూ తిరిగి, కాలు చేతులూ తన స్వాధీనంలేని ఒక పురుషుడు - కొయ్యపెట్టెలో కూర్చొనివున్నాడు - కొయ్యపెట్టెకు చక్రాలు అమర్చబడివున్నై, ముందువైపున దాన్ని ఈడ్చుకుపోడానికి వీలుగా పెద్ద తాడొకటి కట్టబడింది. ఆ పురుషుని శరీరంలోని ప్రతి అవయవాన్ని ప్రతి నరనరాన్ని పక్షవాతపు రోగం లోబరుచుకొంది. అతను కూపస్థమండూకంలా ఆ పెట్టెలోనే జీవితాన్ని గడుపుతున్నాడు. అతని వయస్సు 25 సంవత్సరాలు వుండవచ్చు. మొదట కఠినంగా మాట్లాడినా అతన్ని చూచిన తరువాత వాళ్ళెవరో తెలుసుకోవాలనేకోరిక జనించింది.

ఆమెతో "అమ్మాయి! అతనెవరు! నీకేం గావాలి" అన్నాడు. "నా భర్త బాబూ! ఈ లోకంలో నా అన్నవాళ్ళులేని నిర్భాగ్యులం. వారికి నేనూ, నాకు వారే యీ ప్రపంచంలో దిక్కు. వారు గడిచిన ఆరుమాసాలనుంచి ఆ వ్యాధితో బాధపడుతున్నారు. అప్పటినుంచి ఈ యాచన. మొగదిక్కులేని నిస్సహాయను. నాకా అక్షరంరాదు. చీకటి నలుమూలలా, ఆపదలతో కమ్ముకునివస్తే, ఏంచేయగలను! ఆకలిమంటలతో అక్రోసిస్తూ మర

జీంచలేక, ముఖ్యంగా వారు ఆకలిమంటలతో అలమటిస్తూంటే చూడలేక, మానమర్యాదలు అవతలపెట్టి ఈ పనికి పూనుకొన్నాను. ఇంతో అంతో మానమర్యాదలు మాకువున్నా పరిస్థితులుకు పాదాక్రాంతులైపోయాం" అంది ఆమె.

ఆమె చెప్పిన విషాదగాథతో డాక్టర్ రామారావుకి హృదయం ద్రవించింది. అందులో యవ్వనంలోవున్న ఆ దంపతు లిద్దరినిచూచి, ఆ యువతి వ్యాధిగ్రస్తుడైన భర్తను వెంటబెట్టుకొని యాచించి జీవించడం హృదయంలో బాధపెట్టింది. దాన ధర్మాలంటే ఇష్టంలేకపోయినా, ఆయన రూపాయనోటుతీసి ఆమెకుయిచ్చి "రేపు ఉదయం అతన్ని తీసుకొని యిక్కడికిరా! మీతో మాట్లాడాలి" అన్నాడు డాక్టర్.

మొదట అంత కఠినంగా మాట్లాడిన డాక్టర్, అతి కరుణామూర్తిగా, ప్రశాంతతో ఆమెను మరుసటిదినం రమ్మని కోరడం, ఆమెలో సంభ్రమాశ్చర్యాలు ఏక కాలంలో జనింపజేసాయి.

♦ ♦ ♦

రాత్రి భోజనానంతరం పడక కుర్చీలో పడుకొని డాక్టర్ సాయంకాలం తను చూచిన ఆ దంపతులనుగూర్చి ఆలోచించసాగేడు. ఆయనకు ఆ యువతి పొందే కష్టాలినిచూస్తే జాలివేసింది. యవ్వనంలో వున్న ఆమె, వ్యాధిగ్రస్తుడైన భర్తకోసం యాచించవలసివచ్చింది. యవ్వనంలో భర్తచేత సుఖం అనుభవించే అదృష్టం ఆమె కుండినట్లులేదు. అందులో భర్తను వెంటపెట్టుకొని యాచించడం డాక్టరికి కష్టంవేసింది. అదే డాక్టరును, వారికి ఏదో విధంగా సహాయం, ఉపకారంచేసి, యాచించక జీవించేమార్గం చూపమని ఆత్మ ప్రేరేపించినట్లయింది. అంతేకాక ఆ యువతిపై డాక్టర్కు ఒక అభిప్రాయమేర్పడింది. లక్ష్మిలాంటి ఆమె ముఖవర్చస్సు మెరుస్తూంటే, అలాంటి అమ్మాయి తన కుమార్తెగాగూడదా అని తలపోసాడు — డాక్టరికి సంతానమూలేదు — భార్య గతించి అప్పటికి పది సంవత్సరాలు అయింది — ఆయనకా అరవయోపడి సమీపిస్తున్నాదయ! ఈ వైద్య వృత్తిలోనే ఆయన తల ముగ్గుబుట్టలా నెరసిపోయింది—లక్షలార్జించాడు—ఆ పట్టణంలో యిప్పటి అధునాతన పరికరాలతో, ఆధునిక పద్ధతులతో ఒక నర్సింగ్ హోం కట్టించాడు — ఆయన చేతిక్రింద 4, 5 అసిస్టెంట్స్ డాక్టర్లు పనిచేస్తున్నారు—డాక్టర్ ఆమెను తన కుమార్తెగా భావించి — ఆమె కష్టాన్ని బాపదలచుకొన్నాడు — ఆలోచించి ముందుచేయవలసింది - వారినిగూర్చి ఒక నిశ్చయానికి వచ్చాడు.

♦ ♦ ♦

మరుసటిదినం ఉదయం ఆమె తన భర్తను తీసుకొని డాక్టర్ చెప్పినట్లు ఆయనవద్దకు వచ్చింది. డాక్టర్ వారిద్దర్ని ఆహ్వానించి, గదిలోని బెంచిపై కూర్చోమని "అమ్మాయి! నీ పేరేమో నాకు తెలియదు — మనకా ఎట్టి బంధుత్వంలేదు. కాని ఇంత చిన్నవయసులోవుండి సుఖపడాల్సిన కాలంలో నీవిలా కష్టపడుతూండడం నాకు బాధగావుంది. అందులో యువతివి, భర్తను వెంటపెట్టుకొని యాచించడం సహజంగా లోకంలో జరిగేవికావు. భర్త రోగపీడితుడైయున్నాడని ఆతనికోసం నీవు నిజంగా త్యాగంజేసావుకాని ఇకపై ఈ ముష్టెత్తడం మానుకొమ్మని కోరుతున్నాను" అన్నాడు.

ముఖం, వెలవెలబోతుంటే, ఏదో ఉపకారం ఆశించిన ఆమెకు అలాంటిడాక్టర్ కోరికతో నిలువునా కూలిపోయింది "అదేలా బాబూ! యాచించక, ఇక ఏమార్గంనుండి జీవితావసరాలు పొందక, జీవించడం ఏలా బాబూ! వారు చల్లగా వుండివుంటే ఈగతి లేకపోయేది" అంది ఆమె.

"మీరు సుఖంగా జీవించేమార్గం చూపుతాను అయితే అందుకు కొన్ని షరతులు ఒప్పుకోవాలి. అలా ఒప్పుకొంటే ఆ మార్గంమేదో చెబుతాను!"

"చెప్పండి! ఒప్పుకొంటాం" అంది ఆమె.

"మొదటి షరతు - నీవు, ఇకముందు యాచించకుండావుండడం, ఇకపైన ఆ విధంగా మరి ఎన్నటికి

ఆచరించనని ప్రమాణంచేయాలి. అలా చేసానా, అందుకు ప్రత్యామ్నాయంగా నీ వెవ్వరిని పోషించ డానికి, ఇంత కష్టపడుతున్నావో, అతనిని మరలా సిసలైన మానవునిగామార్చే బాధ్యతనాది ! అందుకు మీ యిద్దరికేమైన అభ్యంతరంవుందా ?" అన్నాడు డాక్టర్. సంభ్రమంతో ఆమె "ఉచితంగా వైద్యం చేస్తారా బాబూ ! చిల్లిగవ్వకూడా యివ్వలేమే" అంది.

"అవును !"

"ఎంతటి దయార్ద్ర హృదయులు మీరు ! దేవుని లాంటివారు. బీదల కష్టాన్ని సులభంగా గ్రహిం చారు — ఆపదలనే సముద్రంలో కన్నూ మిన్నూ కానక ఈదులాడుతుండే మమ్మ ఒడ్డున చేర్చ నున్నారు — మీరు చేసే సహాయానికి పట్టిచేతులతో శూన్యం చూపించడంకన్నా యింకేమిచేయలేము — లేదా పట్టి కృతజ్ఞతా వచనాలు తెల్పగలంగాని, కాని దబ్బుమట్టుకు ఇవ్వలేం" అంది ఆమె.

"పిచ్చిపిల్లా ! అలా అంటావే ! ఇంతకు మునుపే చెప్పాను - అతన్ని తిరిగి మానవునిగా, అందులో నవమన్మథుడుగా మార్చడం నా బాధ్యత. దాంతోపాటు మీ పోషణభారంగూడా నేనే భరి స్తాను — అందుకు మీఇద్దరికీ సమ్మతమేనా" అన్నాడు డాక్టరు.

"విశాల హృదయంతో పూచికపుల్లయిన మా వద్దనుండి పుచ్చుకోక ఉచితవైద్యంచేసి, సహాయం చేస్తానంటే, వద్దంటామా బాబూ ! ఈ లోకంలో మీ లాంటి మహానుభావులు పదిమందివున్న, లోకం చల్లగా వుండేది" అని. "మాకు సమ్మతమే బాబూ" అంది ఆమె. ఆమెభర్త ఆ సంభాషణ సంపూర్తిగా విన్నవాడు కాబట్టి తన సమ్మతంగూడా తెలిపాడు.

ఆమె డాక్టర్ పాదాలపైవాలి "బాబూ" అని కన్నీటి బాష్పాలు రాల్చింది. ఆమెను లేవదీసి "ఎందుకంత క్రిందా మీదులవుతావు — నేచేస్తానన్న ఉపకారాన్ని కొండంతలుచేసి చెప్పుకోనవసరంలేదు— చేసేవృత్తి, చేస్తానన్న ఉపకారం ఒకే చేతిమీదగా జరిగేవిగా. అందులో నేను చేసే పెద్ద ఉపకార మేమిటి ? నీవు అతనితోపాటే ఈ నర్సింగ్ హోంలో వుండిపో" అన్నాడు డాక్టర్.

ఆ దంపతు లిద్దరూ తమ కష్టాలు గట్టెక్కే మార్గం అతి సునాయాసంగా లభించినందుకు ఎంతో ఆనందభరితులయ్యారు — డాక్టర్ యొక్క ఉపకార బుద్ధికి, ఉపకార గుణాన్ని వేనోళ్ల పొగడారు.

♦ ♦ ♦

వారిద్దరిని ఆ దినమే తన నర్సింగ్ హోంలో చేర్పిం చాడు. అందులో ఒక చక్కని తోటవుంది. అందు ఒక పూరిపాకవుంటే, దానిలోపల వారిద్దరినిఉంచి, అతని పరిచర్యలకు ఆమెనే నియోగించాడు డాక్టర్. వైద్యం ప్రారంభించిన తరువాత వారిద్దరి పేర్లు తెలుసుకొన్నాడు డాక్టర్. అతనిపేరు సుందరం — ఆమె కమల. డాక్టర్ హస్తవాసిలో మహత్తరమైన ప్రభావముంది. సాధారణంగా ఆయన పట్టిన ప్రతికేసూ, అందులో నరాల సంబంధ మైన వాటిని తిరిగి తలెత్తకుండా అణిచివేసిన ప్రము ఖుడు. సుందరానికి వైద్యం ప్రారంభించిన మూడు మాసాలలోనే, అతని వ్యాధి తగ్గుముఖంపట్టింది. కాలు చేతులూ అతని స్వాధీనంలోనికివచ్చాయి. లేచి నిలుచోడానికి శక్తిమటుకురాలేదు. కమల ఆనందానికి అంతులేదు - పెల్లుబికి వెల్లువలైపారింది. సుందరాన్నిచూచి మురిసిపోయింది. ఏడుకొండల వెంకటేశ్వరునికి 1000 కొబ్బరికాయలు కొట్టుతానని మ్రొక్కుకొనివున్నా అందులో ఆశ్చర్యపడనవసరం లేదు. మరి రెండు నెలలలో సుందరాన్ని సంపూ ర్తిగా మానవుని రూపంలో తిరిగి తలఎత్తి తిరగగలిగే టట్లు మార్చివేసాడు డాక్టర్.

ఒకదినం డాక్టర్‌తో సుందరం! "డాక్టర్ బాబూ! మీ పుణ్యంవల్ల ఈ ఘోర వ్యాధినుండి విముక్తి చెందాను. మీ ఋణం ఏలా తీర్చుకోవాలో అర్థం గావటంలేదు. ఆరుమాసాలనుంచి మా దంపతులిద్దర్ని పోషించి వైద్యంచేసారు. కొద్దో గొప్పో చదువుకు న్నాను — ఎక్కడన్నా ఉద్యోగం చూచుకొని యిద్ద

రం జీవనం గడుపుతాము. శలవియ్యండి" అన్నాడు.

"నాయనా! ఆలా తొందరపడుతావెందుకు! నీకు యింకా రెండు నెలలు సంపూర్ణంగా విశ్రాంతి అవసరం. మధ్యలో మళ్ళా కష్టపడి పనిచేసావా, నరాలు మళ్ళా బలహీనమై వ్యాధి తిరిగిరావచ్చు. అదీగాక మీరు మీ పోషణనుగూర్చి చింతించనవసరంలేదు. మనస్సులోగూడా అనుకోకండి' అది నా కోరిక!" అన్నాడు డాక్టర్.

డాక్టర్ మాటలకు తిరిగి జవాబివ్వలేకపోయాడు సుందరం.

మరి రెండు మాసాలుగూడా గడిచిపోయాయి. డాక్టర్ తిరిగి వారు వెళ్ళకుండా వేరే గడవు పెట్ట దలచుకొన్నాడు. ఆయన హృదయంలో వుండే ఆలోచన వేరు_ కమల_సుందరం తన ఎదుట తన కళ్ళఎదుట వుండిపోవడమే కావలసింది. కమలను చూస్తే ఆయనకు ఎక్కడలేని ప్రేమాభిమానం, అంతఃకరణము వుండేది. కమలను తన తనయగా భావిస్తుండేవాడు. ఆ రోజు కమల డాక్టర్ వద్ద "బాబూ! మీఋణం ఎన్నటికీ తీర్చలేనట్టిది. అంతేకాక మీ ఆదరణ ప్రశంసనీయం. మీకు చెప్పగలవాళ్ళం కాదుగాని, ఎన్నిదినాలని మమ్మ పోషిస్తారు!నిజంగా యిప్పటికే మీకు పడిన ఋణాన్ని యింకా భారంగా పెంచుకోమంటారా! ఆయన ఆరోగ్యవంతుడైయాడు- యికపై నన్ను పోషించే భారం యింక వహిస్తాడు! శలవియ్యండి" అంది. కమల అంత మోహమాట పడుతూంటే- డాక్టర్ తన కోరికను వెల్లడించలేక పోయాడు. "అమ్మాయి! మీరు సుఖంగా నవజీవనంతో సుఖజీవనం సాగించండి- ఆపై దేవుడున్నాడు. రేపు వచ్చే 10వ తేది మంచి దినం. ఆ రోజు వెడుదురులే!" అన్నాడు.

♦ ♦ ♦

ఆ దినం వచ్చింది. ఆరోజు డాక్టరికి చెడ్డదినంలా కనిపించింది. కన్న కూతురుగా భావించిన కమల తన్ను విడిచి వెడుతున్నరోజు. డాక్టర్ వారిద్దర్ని నూతన వస్త్రాలతో ఆదరించి, సుందరంతో "అబ్బాయి! కమలలాంటి పిల్లని వేయి జన్మాలెత్తి నా భార్యగా పొందలేవు. ఉత్తమురాలు. ఆమె ఏ విధంగా, నీవు వ్యాధిలో వున్నప్పుడు జీవనోపాధికై శ్రమపడింది నీకు తెలుసు! యింతవరకూ అష్ట కష్టాలు పడ్డ కమలను యికపై సుఖపెట్టడం నీవంతు." అన్నాడు డాక్టర్.

ఆ దంపతులిద్దరూ డాక్టర్ పాదాలకు నమస్కారం చేసారు. ప్రణామం చేసినవారిని 'దీర్ఘాయుష్మాన్ భవ' అని దీవించాడు. సుందరంచేతికి ఒక లెటర్ యిచ్చి "సుందరం, ఈ జాబు తీసుకొని సారువ అనే వూరు వుంది - అది యిక్కడికి 10 మైళ్ళలోవుంది. ఈ పేరుగల ఆసామినిచూచావా అతను నీకు ఉద్యోగం చూపిస్తాడు!" అని చెప్పాడు.

విడిచి వెళ్ళలేక వెళ్ళారు ఆ దంపతులిద్దరు. వారు వెళ్లుతూంటే, తన కన్నకూతురు, అల్లుడు తన్ను విడిచి పోతున్నట్లు బాధపడ్డాడు డాక్టర్. ఆయన నేత్రాలు అశ్రుపూరితాలయ్యాయి.'

♦ ♦ ♦

కాలచక్రంలో ఆ మాసం వెళ్ళి మళ్ళీ అదేమాసం వచ్చింది. డాక్టర్ కమలా సుందరాలు వెళ్ళిన కొన్నిదినాలవరకు మనస్సులో బాధపడ్డాడు. ఏదో ఒంటరితనం అనుభవిస్తున్నట్లు తలచసాగాడు. ఆ విధంగా మధనపడ్డాడు.

ఆ రోజు సాయంత్రం డాక్టర్ కారులో షికారుకు వెళ్ళి, 6 గంటల ప్రాంతంలో తిరిగివస్తున్నాడు - నర్సింగ్ హోం వైపు. అనుకోకుండా, ఆకస్మికంగా ఆకాశం మేఘాలతో నిండి ప్రళయంగా గాలితో పాటు వర్షించసాగింది. ఆ పెనుగాలి, వర్షంతో ప్రశాంత వాతావరణం అల్లకల్లోలమైపోయింది. నర్సింగ్ హోం పరిసర ప్రాంతంలో కారు వుందనగా డాక్టరుకు తన కారుకు నూరు గజాలలో ఓ స్త్రీ వీచే ప్రళయ పెనుగాలిని, వర్షాన్ని లెక్కచేయక, జంకక, ఏకాకిగా ముందుకు చకచక ప్రయాణం సాగిస్తున్నది. అంత పెద్ద గాలివానలో ప్రయాణం చెయ్యడం

ప్రాణాపాయమైనా ఆమె లక్ష్యపెట్టడంలేదు. కారు లైట్లు ముందువెడుతున్న స్త్రీపై ప్రసారింపబడ్డాయి. ఆ రోడ్డుకు యిరువైపులా పెద్దపెద్ద చెట్లు భీకర రాక్షసులలా ఆ కారు చీకట్లలో కనుపిస్తున్నాయి. కాని, ఆకస్మికంగా ఘోరప్రమాదం జరిగింది. రోడ్డు కిరువైపులా ప్రళయమార్తాండానికి ఉద్రూత లూగిపోతున్న చెట్లు, అందులో పెద్ద పెద్దవి విచ్చల విడిగా వూగిపోతున్నాయి. కూకటి వేళ్ళతోపాటు వూగులాడిపోతున్న ఆ చెట్టు. కొమ్మలతోపాటు పెళపెళమంటూ ముందు వెడుతున్న స్త్రీపై విరిగి పడింది. ఆ స్త్రీ చేసిన ఆర్తనాదానికి, డాక్టరుతో పాటువున్ని అతని మిత్రుడు హడలిపోయాడు. కారాపి, ప్రమాదానికి లోనైన ఆ వ్యక్తి రక్షణకై డాక్టర్ ఆ చెట్టుకొమ్మల మధ్య గాలించి, బహు ప్రయాసపై, తన మిత్రుడి సహాయంతో ఇవతలకు తీసాడు. ఆ హతురాలు యొక్క తల రెండుగా చీలి నెత్తురుముద్దగా వుంది. రక్తంధార ప్రవాహంగా వెళ్ళిపోయింది. కాని ఆ వ్యక్తి తలపై తన చీర పమిటికొంగు కప్పుకొన్నందువల్ల వ్యక్తిని గుర్తించ వీలులేకపోయింది.

నర్సింగ్ హోంకు చేర్చి, తగిన ప్రథమ చికిత్స నిమిత్తం, తలపైనుండి ముసుగు తొలగించిచూచిన డాక్టర్ ఒక్కనిమిషం నిర్ఘాంతపడి, అలాగే నోట మాటలేక నిలచిపోయాడు. ఆయన నోటనుండి "కమలా నీవా" ! అనే రెండే రెండుమాటలు వెలువడ్డాయి. కమల అప్పటికి స్పృహలోలేదు. ఆమెకు చేయవలసిన వైద్యంచేసి, ఆమె స్పృహకలిగి తిరిగి మన ప్రపంచములోనికి ఎప్పుడు వస్తుందా అని ఎదురు చూస్తూ కూర్చున్నాడు డాక్టర్. ఆయనకు కమల ఒంటరిగా, అందులో రాత్రి సమయంలో దూర ప్రాంతంనుండి రావలసిన అవసరం కనుపించలేదు.

రెండుగంటలకు తరువాత కమల కన్నులు తెరచి నలువైపులా తిలకించింది. తన ప్రక్కనే డాక్టర్ నిలబడివుండడం చూచి ఆమె చేయెత్తి నమస్కరిస్తూ చిరునవ్వు నవ్వింది. ఆమెలో ఒక విధమైన తేజస్సు రాసాగింది. డాక్టర్ "కమలా! ఏలావుంది ! వంటరిగా వచ్చేవేం ! సుందరం ఎక్కడ?" అన్నాడు ఆత్రుతగా.

అందుకు సమాధానం, వెక్కి వెక్కి ఏడుస్తూ, హీనస్వరంతో "ఏమని చెప్పను బాబూ ! నాది ఒంటరి జీవితం అయిపోయింది."

"ఆయాసపడక తిన్నగాచెప్పు"

లేనిశక్తిని తెచ్చుకొని కమల "ఇక్కడనుంచి వెళ్ళిన ఆరుమాసాలవరకు మా జీవితం ఆనందంగా వెళ్ళిపోయింది. కాలం ఒకవిధంగా వుండదుగా ! తిరిగీ మళ్ళీ నా కష్టదినాలు నన్ను వెంబడించాయి. మసూచికవల్ల అందవిహీనవయ్యాను. ప్రేమ-వివాహం చేసుకొన్న సుందరం నేను, మధ్యతరగతికి చెందినవారమే. కాలేజివరకు చదివి ఆదర్శంగా వివాహమాడిన సుందరం పరిస్థితులైనా ఆలోచించక, కాలానికి దాసుడై అందవిహీనవైన నన్ను, యింటి నుండి వెళ్ళగొట్టాడు." అంది కమల. 'సుందరంపై వచ్చిన ఆగ్రహాన్ని పట్టలేకపోయాడు. "నీచుడు — నీవు చేసినసేవను మరచిన కృతఘ్నుడు; పామును చంపినట్లు యిలాంటివారిని చిత్రవధచేసినా పరవాలేదు." "అమ్మాయి నిన్ను నా కన్నకూతురుగా చూచుకొంటాను. మరేం భయంలేదు_బాధపడకు" అని ఓదార్చాడు.

కాని కమలమటుకు "బాబూ ! సుందరంలేని జీవితం జీవించలేను. భర్తచే అసహ్యించుకొని జీవించడంకన్నా జీవితం చాలించడం మంచిది. నా కడసారి కోరిక నెరవేరింది" అంది ఆమె.

డాక్టర్ ఆమెకు తగిలినగాయాలు పరీక్షించి, అవి ప్రమాదానికి దారితీస్తున్నాయని గ్రహించాడు. నివారణకై తగిన ప్రయత్నంచేసినా అప్పటికే రక్తం ఎక్కువగా వెళ్ళిపోయినందున ప్రమాదాన్ని నివారించడం వీలుపడలేదు — అసాధ్యం అయింది. కమల

రాత్రంతా స్పృహలోలేదు. తెలతెల తెల్లవారుతుండగా ఆమె స్పృహలోనికి వచ్చింది. కిటికీలోనుంచి అరుణకాంతులు ఆమెపై ప్రసరిస్తుండగా డాక్టర్ చేతుల్ని తన చేతులలోనికి తీసుకొంది. మరు నిమిషంలో ఆమెలోని ప్రాణవాయువులు అనంత విశ్వంలో కలసిపోయాయి.

"దురదృష్టవంతురాలు! నిర్భాగ్యజీవి! సుమతిలా భర్తకు సేవ చేసి, కడకు సుఖం అనుభవించబోతే అది మేడిపండుగా అయింది. ఆమె ఆత్మకు శాంతి కలుగుగాక" అన్నాడు డాక్టర్. అవునన్నట్లు అతని కంటి కొలికిలో నిలిచివున్న అశ్రుకణాలు జలజల రాలాయి.

(ఒక తమిళ కథ ఆధారంగా)

---

"ఓరే రామం! మనుషుల మీద ఎప్పుడూ ఆధారపడివుండే జంతువేదో చెప్పు?"

అని పంతులు జంతువులు మనుషులకు చేస్తూవున్న సహాయాన్ని గురించి పాఠాన్ని బోధిస్తూ క్లాసులో రామాన్ని అడిగాడు.

రామం బల్లమీదనుండి చటుక్కున లేచి, అదురూ బెదురూ లేకుండా "జలగ, సార్" అని సూటిగా జవాబునిచ్చాడు.

♦ ♦ ♦

(తనలో తాను!) "ఆ మహానుభావుడు నేను అడగ్గానే రెండువేలు బదులు ఇచ్చాడు. ఇవ్వాళ తన అవసరాలకు ఆ సొమ్ముని ఇచ్చేయమని అడిగాడు ఆబాకీని తప్పని సరిగా తీర్చివేయాలి. లేకపోతే ఆయన బాధపడుతాడు. కాని అంత పెద్ద మొత్తాన్ని ఇవ్వాళ ఎవరు ఇస్తారు? ఇది క్లిష్టసమస్య! దీన్ని ఎలా తేల్చగలుగు తానో బుర్రనెంతగాలించినా తెలియడం లేదు. ఈ సుడిగుండాన్నుంచి తప్పుకో డానికి ఏ సాధనోపాయం మంచిది చెప్పుమా?" అని ఒకాయన తర్జన భర్జన చేస్తూన్నాడు.

♦ ♦ ♦

"మొన్న రాత్రి రెండుగంటలకు ఈ పర్సు దొరికిందికదూ. దాన్ని అప్పుడే ఎందుకు తెచ్చి ఇచ్చావుకాదు" అని పోలీసు అతణ్ణి క్రాసు పరీక్షచేశాడు.

"అంత అర్థరాత్రిలో ఎలా తెచ్చి ఇయ్యను" అని వాడు ఆ అధికారికేసి చూస్తూ జవాబిచ్చాడు.

"అలాగయితే నిన్న ప్రొద్దున్నే ఇచ్చి వుండాలసింది"

"నిన్న దాన్లో ఏమీ లేదు. అంచేత ఇవ్వాళటివరకూ వేచివుండాలసివచ్చింది" అని తడుముకోకుండా జవాబిచ్చాడు.

డాక్టరు వి. యస్. శర్మ

# దక్షిణ భారతదేశపు అమూల్య సంపద — నిమ్మగడ్డి



న్యూయార్క్ నగరంలోని ఫిఫ్త్ ఎవెన్యూలోగాని, లండన్ నగరంలోని బాండ్ స్ట్రీట్‌లోగాని, పారిస్ నగరంలోని షాంప్స్ ఎలిసీస్‌లోగాని, ఢిల్లీ నగరంలోని కన్నాట్ సర్కస్‌లోగాని మరే పెద్ద నగరంలోని అందాల షాపుల్లో అమ్మే ప్రపంచ ప్రఖ్యాతిమైన సెంట్లు చాలావాటిలో వుండే మూల ద్రవ్యం దక్షిణ భారతదేశంలో విస్తారంగా పెరుగుతూవుండే నిమ్మగడ్డిలోనుంచి తీయబడినట్టిదే.

విస్తారంగా పెరుగుతున్న, ఇంత ఉపయోగకరమైన ఈ నిమ్మగడ్డిని దక్షిణ భారతదేశంలోనివారు పూర్తిగా సద్వినియోగంచేసుకోనకపోతున్నారని చెప్పవలసి వుంటుంది. ఈ గడ్డినుంచి తీయబడే నిమ్మగడ్డినూనె సెంట్లు తయారుచేయడానికి ఉపయోగపడుతున్నది. "ఆయొనన్స్" తయారుచేయడానికిగాను, సెంట్ల ఉత్పత్తిదారులకు ఈ నిమ్మగడ్డినూనె అవసరమాతున్నది. సబ్బు, స్నో వగైరాలను తయారుచేయడానికికూడా మూల ద్రవం ఈ నిమ్మగడ్డినూనే.

ఇండియానుంచి నిమ్మగడ్డి నూనెను ఎక్కువగా కొంటున్నది అమెరికాదేశమే. అందువల్ల ఇండియా - అమెరికాల మధ్య స్నేహాన్ని ఈ నిమ్మగడ్డి నూనె దృఢతరం చేస్తున్నదనికూడా చెప్పవచ్చు.

గత కొద్ది సంవత్సరాలలోను ఈ నిమ్మగడ్డి నూనెవల్ల ఇండియా రాబడి క్రమంగా ఎక్కువ అవుతూ వచ్చింది. 1954-లో 736 టన్నుల నిమ్మగడ్డి నూనె ఎగుమతి చేయుబడింది. దీని విలువ కోటి రూపాయలకు పైగావుంది.

ద్వితీయ ప్రపంచ యుద్ధ కాలంలో విటమిన్ 'ఎ'ను కృత్రిమంగా తయారుచేసే విధానాన్ని అమెరికా శాస్త్రజ్ఞులు కనిపెట్టిన కారణంగా ఈ నిమ్మగడ్డి నూనెకు ఇటీవల గిరాకీ బాగా పెరిగిందని అంటున్నారు. కాడ్‌లివర్ అయిల్‌లో విటమిన్ 'ఎ' సమృద్ధిగా వుండగా, కాడ్ చేపలు సముద్రంలో సమృద్ధిగా లభిస్తూవుండగా విటమిన్ 'ఎ'ను కృత్రిమంగా తయారుచేయడం విపరీతంగా కనుపించవచ్చు. ఇందుకు సమాధానమేమంటే, కాడ్‌లివర్ ఆయిల్‌కు వుండే దుర్వాసన, అరుచి కృత్రిమంగా తయారుచేయుబడిన విటమిన్ 'ఎ'కి వుండదు.

నిమ్మగడ్డినూనె విదేశాలకు ఎగుమతి ప్రారంభం కావడానికి పూర్వం అంజనాలు మొదలైనవి తయారుచేయడంకోసం స్థానిక పారిశ్రామికులే ఎక్కువగా ఉపయోగించుకునేవారు. క్రిమిసంహారిగా

కూడా ఈనిమ్మగడ్డినూనె చాలా ఎక్కువగా ఉపయోగపడుతున్నది. దీనిని శరీరానికి రాచుకుంటే దోమలు దగ్గిరికిరావు అంతేగాక, రైతులు కోరళ్ళలో మట్టి కరగిపోకుండా వుండడానికిగాను వాటిపై ఈ నిమ్మగడ్డిని పెంచుతూ వుంటారు.

తొలకరి వర్షాలుపడగానే ఈ నిమ్మగడ్డి విత్తనాలను నాటుతారు. ఎకరానికి సుమారు 15 పౌండ్ల విత్తనాల చొప్పున నాటుతారు. ఐదునెలలయ్యేసరికి నిమ్మగడ్డి మొదటికోతకు వస్తుంది. ఆ తరువాత కర్రబూడిద (వుడ్ ఏష్) ఎరువును వాడితే ఈ నిమ్మగడ్డి త్వరత్వరగా ఎదుగుతుంది. నెలకొకసారి ఈ నిమ్మగడ్డిని కోతకోయవచ్చు. ఇలా ఈ నిమ్మగడ్డి మొక్కలు ఆరేసి సంవత్సరాలపాటు ఎదుగుతూనే వుంటాయి.

ఈ నిమ్మగడ్డినుంచి నూనెను తయారు చేయడానికిగాను ఇప్పటికీ మామూలుగా ఉపయోగించే బట్టీలలో ఒక బాయిలర్ ఉంటుంది. ఈ బాయిలర్‌కు ఒక పీపాతో గొట్టంద్వారా సంబంధం ఏర్పరచబడి వుంటుంది. బాయిలర్లో నిమ్మగడ్డినివేసి, నీరుపోసి కింద మంటపెడతారు. ఈ కారణంగా వెలువడే ఆవిరి, బాయిలరును, పీపాను కలిపే గొట్టంలోకివచ్చి అక్కడ తిరిగి ద్రవంగా మారుతుంది. ఇలా ఆవిరి తిరిగి ద్రవంగా మారడానికిగాను గొట్టంపైన చన్నీరు ఎప్పుడూ ప్రవహించేటట్లు చేయబడుతూ వుంటుంది. ఈ విధంగా ఆవిరి కాస్తా ద్రవంగామారి పీపాలోకి బొట్లు బొట్లుగా పడుతుంది. ఈ ద్రవంలో నిమ్మగడ్డినూనె, నీరూకూడా వుంటాయి. అయితే నీరు, నూనె కలవవు కనుక రెండూకలిసి వేరువేరుగానే వుంటాయి. అప్పుడు నీటిని ఇగరబెట్టి నిమ్మనూనెను డబ్బాలలోకెత్తి సీల్లు వేస్తారు.

ఒకప్పుడు వృధాగాపడివున్న ఈ నిమ్మగడ్డిని నవీన శాస్త్ర విజ్ఞానం పూర్తిగా ఉపయోగించుకుంటున్నది. సుగంధ ద్రవ్యాలను తయారుచేయడానికి ఉపయోగపడే ఈ నిమ్మగడ్డి, విటమిన్ 'ఎ' అవసరమైవుండి కాడ్‌లివర్ ఆయిల్ తాగలేక అవస్థపడే పిల్లలు ఆ బాధలేకుండా విటమిన్ 'ఎ' పొందేటట్లుచేసి వారికి సంతోషాన్ని చేకూరుస్తున్నది. అంతేగాక, దోమల బాధతో భయకంపితులైన సమశీతోష్ణ ప్రదేశవాసులకు ఆ దోమల బాధనుంచి విముక్తి చేకూరుస్తున్నది. పట్టణాలలోను, గ్రామాలలోను క్రిమి సంహారానికి నిర్విరామకృషి చేస్తున్న డాక్టర్లకు క్రిమి సంహారం విషయంలో తోడ్పడుతున్నది.

'యు. యస్. ఐ. యస్'

—o—

# టైపిస్టు రాణి

శ్రీమతి జి. సత్యవతి

—(౦)—

[పద్మారాణి తల్లి చనిపోవడం, తండ్రి రిటైరవడంతో స్కూలు ఫైనలు చదువు పూర్తయి ఆగింది. తన్ను వివాహమాడుతాడను కొనిన మామయ్య వివాహమాడక పోవడంతోటి, ఆర్థిక దుస్థితితోటి రాణి నిరాశ, నిస్పృహలకు ఆహుతి అయింది. తండ్రి పూర్వకాలపు మనిషి. పరువు ప్రతిష్టల నుద్దేశించి కుమార్తె ఉద్యోగంచేసి సంపాదించడం యిష్టంలేదు. కాని క్రుంగి, కృశించి పోతున్న కుమార్తెను చూచి అతని కడుపు చెరువయి ఆమెలో సంతోషమును, ఉత్సాహమును పూరించడానికని రాణి ఉద్యోగం చెయ్యడానికి సమ్మతించాడు. రాణి తను షార్టుహాండ్, టైపురైటింగ్ నేర్చుకోని ఉద్యోగం చేయడమునకు సహాయము చేయవలసినదిగా స్నేహితురాలు ఎలీనాను కోరి సరి అనిపించుకొంది — యిక చదువండి]

(గతసంచిక తరువాయి)

తన తెలివితక్కువతనం అంత త్వరలో సవరణ అయినందుకు రాణిముఖం పాదరసం బల్బులా మెరిసింది - "అవును ఎలీనా! నా తెలివి అలా ఏడిసింది. అసలు అరవయ్యో డెబ్బయ్యో ముందే ఎవరైనా ఇచ్చుకుంటారా...ఇలానే వుంటుంది, ప్రపంచంలో మనం ఏ పనీ చేయలేమనుకుంటూ, చేయటానికుపక్రమిస్తే, జరిగేవికూడా జరగవు.

నీ సహాయం ఎన్నటికీ మరువను ఎలీనా. నా జీవితానికి మెరుగు పెట్టినదానవయ్యావు. భగవంతుని దయవల్ల చిన్న ఎపాయింట్‌మెంట్ కూడా వచ్చిందా వెంటనే నీ సొమ్ము......"

"నువ్వు టైపుకంటే, ట్రెయినింగయితే తేలిగ్గా ప్యాసవ్తావు." అన్నాది ఎలీనా సీరియస్‌గా.

"ట్రెయినింగా? – ఏం – ఎలాగ." అన్నాది రాణి కంగారు పడుతూ "అబ్బే! – నీ వాలకాన్ని బట్టి చూస్తే అలా అనిపిస్తుంది" అన్నది నవ్వుతూ

"అది కాదే......"

"వూరుకో అదికాదు, ఇదికాదు నామీదవున్న అనుమానం పోగొట్టి నిన్ను సంతృప్తి పెట్టగలిగినందుకే నాకు పరమానందంగా వున్నాది."

"ఎలీనా! డార్లింగ్!" అని ఎలీనా భర్త పిలిచేడు లోపల్నుంచి

రాణీ "ఆయనిక్కడికివస్తారా!" అంటూ కంగారు పడుతూండగానే ఎలీనా భర్త కోటు బటన్స్ విప్పుతూ వాళ్ళదగ్గరకు వచ్చేసేడు

రాణీ సిగ్గుతో తలవంచుకున్నాది. భయంతో పాదాలు తిమ్మిర్లెక్కినయ్ - అది చూసినట్టు

ఎలీనా ఇంట్రొడ్యూసింగ్ ప్రారంభించింది. దానితో రాణీకివణుకు...

ఇంట్రొడ్యూసింగ్ అయింతరువాత.

"ఎలీనా ఈ సారి పిక్చర్ ఖర్చు నీవే భరించాలి - నాదగ్గర ..." అంటుండగానే, ఎలీనా ఒకసారి మూతి తిప్పుకుని.

"అలాగా! – పాపం. ఈ సారికట, ఈ సారికి టూ టైమ్స్‌నుంచి వరుసగా నేనేగా పెట్టుకుంటున్నాది సిగ్గన్నా లేదు ఈసారికనడానికి!" ట్వంటీయత్ సెంచరీ క్రిష్టియన్ వైఫ్ మందలించింది భర్తని.

"సిగ్గనేది ఆడాళ్ళ సొత్తుగా! - పైగా ఆభరణం కూడాను. ఇక మగాళ్ళకి దాన్ని గురించి మాట్లాడేందుకైనా అర్హతవున్నాదా!...... గాడ్ ఈజ్ గ్రేట్, వస్తానండీ రాణీగారు." అంటూ లోపలకు వెళ్ళిపోయేడు. ఫిఫ్టిఫోర్ మోడల్ హజ్‌బెన్డ్.

వాళ్ళ దాంపత్య జీవితానికి రాణిమనసు ఆశ్చర్యానందాలతో నిండిపోయింది. "ఎలీనా భర్తది ఎంత సరదాఅయినతత్వం" అనుకుంటున్నాది.

భర్త తనని గేలిచేసి వెళ్ళిపోయినందుకు ఎలీనా చెక్కిళ్ళు మందార మొగ్గలయినాయి. ఎందుకాకాలో!...అంత ఆడళ్ళకే సిగ్గుండాలిగాబోలు - తమకైతే వుండక్కర్లేదట.........

"వూరుకోవోయ్ నీకసలు తెలీదు ... అసలు సిగ్గంటే ఏవిటి! – రక్తంలో ప్రవహించే ఎర్ర కణాలు, తెల్లకణాలులాంటి అతిచురుకైన పదార్థం. దానికివుండే శక్తి మంచీ, చెడూ విచక్షణాశక్తి. అటువంటిది రక్తంవున్న ప్రతీవాళ్ళకీ వుండవలసిందే, ఆడా మగా తేడాలెందుకు మధ్య!" అన్నాది ఎలినా సైన్సు భాషలో.

"అదొకరకంగా అనుకో ......"

"ఏరకమో - ఆరకంగురించే నేను మాట్లాడింది." అన్నాది ఎలీనా,

భర్త రెండు పిలుపుల్నీ రాణీ చెప్పినా నిర్లక్ష్యం చేసింది. మూడవపిలుపుతో ఎలీనా భర్తే అక్కడికి వచ్చాడు.

"కోపం వచ్చిందా! ... ... వాటే పిటీయుస్ తింగ్, కోపం మగాళ్ళసొత్తు, డియర్!" అన్నాడు రాణీ వంకకొంటెగా నవ్వుతూ.

రాణీకి ఆతని తత్వంకి వుబ్బెత్తుగా వస్తుంది నవ్వు. కాని ఎలీనా ముఖంమీదినుంచి రవంతైనా సీరియస్‌నెస్ తగ్గలేదు.

వాళ్ళనాపరిస్థిలో వదిలి, రాణీ వీడ్కోలు చెప్పి బయల్దేరింది.

రాణీకి దరి పొడుగునా ఎలీనా భర్త మాటలే చెవులో వినిపిస్తున్నాయ్..."మగాళ్ళు ఎంత తీపిగాను, చమత్కారంగాను మాట్లాడుతారు. ఎంతసరదాగా వుంటారు. అలాంటి వాడు భర్తయితేనే జీవితంలో పెళ్ళి జేసుకున్నందుకు ఫలితందక్కుతుంది. లేకపోతే పెళ్ళే అనవసరం. భార్యఅంటే బానిసపిల్లా! ఏమో, – ఎలీనా దయవల్ల తనకీ బానిసబ్రతుకు అవసరంవుండదు. తిండికి గుడ్డకి తను భర్తమీద ఆధారపడనవుసరంలేదు. భర్త ప్రేమ, భర్త అనురాగం తనకి కావలసినవి కాని, భర్త దయాదాక్షిణ్యాలుకావు ... అవిలభ్యంకానప్పుడు, జీవితాంతం బ్రహ్మచారిణిగానే వుండి ఆత్మ గౌరవాన్నైనా కాపాడుకోవచ్చు."

ఇంట్లో కాలుపెట్టింది, తండ్రి నాకిట్లో పరుండి విద్యుత్తంతులమీద వాయుదేవుని వీణానాదం వింటున్నాడు. అడుగుల చప్పుడుకి రాణీ వచ్చిందేమోనన్న అనుమానం గల్గిందికాని తల త్రిప్పి చూడలేకపోతున్నాడు. ఆరోజు ప్రొద్దుట్నుంచీ అలానే జడుస్తున్నాడు సూటిగా కూతురి మోహంలోకి చూచేందుకు...... "పాపం బిడ్డ; కన్నాడన్న మాటేగాని ఏవిధంగాను కూతుర్ని సౌఖ్యపెట్టలేకపోయేడు. ఈడొచ్చేసరికి తగిన భర్తనుకూడా తీసుకురాలేకపోతున్నాడు. దానికే తల్లివుంటే తనని బలవంతంపెట్టి ఏదో సంబంధం చూసి చేసేసేదేనా ...

"ఏమైనాసరే వున్న కొంప అమ్మేసి పిల్లకి పెళ్ళి చేసేయ్యాలి!........

అలా చేసేస్తే తనకి రోజులు గడపడం ఎలాగు?

"అల్లుడిదగ్గిరా కూతురిదగ్గరా పడివుంటమా!... హుఁ!" ముందుకు వచ్చిన కూతుర్ని చూడగనే ఆయన ఆలోచనలు మాయమై పోయాయి "ఏమిటమ్మా! - ఏమిటీ విశేషాలు?" అనడిగేడు.

"ఎలీనాదగ్గరకు వెళ్ళేనాన్నా! అది ఏర్పాటు చేస్తానన్నాది......మళ్ళీ వచ్చి చెబుతాను, బట్టలు మార్చుకువచ్చి," అని లోపలకు వెళ్ళిపోయింది.

"ఏమి ఏర్పాటో, ఏమిటో నలుగురిలోనగుబాట్లు వచ్చేట్లు చేయదుగదా!" అని ఆందోళనపడ్డా, పరిస్థితులకు లొంగి, "సరే! సర్వేస్వరునిమించి చేయగలిగిందేమున్నది" అని సరి పెట్టుకున్నాడు.

## 2

ఆ నెలలోనే రాణి పరీక్షకి వెళ్ళవలసివున్నాది. స్పీడు తృప్తికరంగానే వున్నది అన్నాడు ట్యూటరు.

రేపు పరీక్షఅనగా ట్యూటర్ దగ్గర పరీక్ష కిటుకులన్నీ తెలుసుకున్నాది.

ఎగ్జామినేషన్ హాలు, టైప్ రైటర్ ముందు కూర్చున్నాది... పేపర్ పుచ్చుకున్నాది. వేళ్ళు రేసులో గుర్రాల్లాగు ఆడుతున్నయ్. రాణీకి వళ్ళంతా ఆనందంతో గగుర్పొడుస్తున్నాది. తెల్లని మల్లె పూలాంటి కాయితంమీద అందంగా అక్షరాలు వుయ్యాలలూగుతున్నయ్. తలలో భావిజీవితపు తియ్యని వూహాలు తెరలు తెరలుగా వస్తున్నయ్...

......ఇంకొక్క నెలలో తనో టైపిస్టు, నెలకి ఎనభై రూపాయల ఎపాయింటుమెంటు...తనపుడేం చెయ్యాలి దాన్నంతటినీ? - వెంటనే ఓ ఎలక్ట్రిఫైడ్, డీసెంట్ అయిన ఇంట్లోకి మారిపోతుంది. నెల నెలా చేతికి కావలసినన్ని - కావలసినవస్తువులు.. కొనుక్కుంటుంది.

సెన్ టెన్స్ ఎయిటీ మైల్స్ స్పీడ్ లో అంతమవుతున్నాది. పేపరు పూర్తిచేసేటప్పటికి ఇంకా చాలా టైమ్ మిగిలిపోయింది హాలంతా ఒక్కసారికలియజూచింది. అందరూ. ఆతృతగా తమ పనుల్లో సంతృప్తికోసం ప్రాకులాడుతున్నారు........ ఒకమ్మాయి, దీక్షగా టైప్ చేస్తుంది. ఆవిడని చూస్తుంటే రాణీకి ఎలీనా జ్ఞప్తికివచ్చింది, - ఆకుపచ్చని జార్జెట్ చీర, వెల్ వెట్ బ్లౌజు, చేతికి వాచి, నవనవలాడుతున్న మొహం......

ఇంతలో బయటగుమ్మందగ్గర ఎలీనా ప్రత్యక్షమయింది.

"బాగాచేసేసి బయటకురా" అని సౌజ్ఞ చేస్తుంది.

"ఇంకాచేయడమేమిటి?" రాణి మనస్సు గర్వపడ్డాది.

ఒక్కసారి తిరిగి చదివి పేపరు ఇచ్చేద్దామనుకుంటూ, తిరిగి చదువనారంభించింది.. ...ఫస్టుపేజి ఫెయిర్ గావున్నది, రెండవపేజీకూడా ఇంచుమించు అలానేవుంది......మూడవపేజీ.........ఏడవపేజీ సగంలో ఒకటి రెండు మిస్టిక్స్ కన్పించేయి.. ... ఎనిమిదిలో చాలా మిస్టిక్స్ వున్నాయ్. తరువాత పేజీలో కొన్ని మాటలే ఎగిరిపోయాయి...రాణీవళ్ళు ముద్దయిపోయింది. రీటైపు చేద్దామనుకున్నాదిగాని, ఆ పని వ్యర్థమనిపించింది, ఏమీతోచటంలేదు. తలలో రైళ్ళు పరుగిడుతున్నాయ్. గుండెలమీద కొండలు నిలిచేయ్. వేళ్ళక్రింద టైప్స్ బండరాళ్ళు అనిపించినయ్......గాలి,......వాన...తుఫాను...

తుఫాను వెలసిపోయింది. కాయితాలుమడిచి ఎగ్జామినర్ కి ఇచ్చి బయటకు వచ్చేసింది.

"ఏం రాణీ,! ఏం..అలావున్నావేం" ఎలీనా ఆదుర్దాగా అడిగింది.

"ఏమీ ఆశలేదు ఎలీనా...అంతావృథా."

ఎలీనా నివ్వెరపోయి "ఏఁవిటి రాణీ నువ్వంటున్నావి?" అనడిగింది.

"పేపరు పాడుచేసేను.........పచ్చి బూతులు రైటప్ చేశాను."

ఇద్దరూ కాంపౌండ్ దాటి బయటకు వచ్చేరు మౌనంగా.

"పోనీలే, ఇంకోసారి వెళ్దువుగాని పరీక్షకి, అలా డిస్కరేజ్ అయిపోకు - అయినా అదంతా నీ భయమే గాని, చూడు నువ్వు తప్పకుండా ప్యాసవ్వకపోతే......" ఆ మాటలన్నీ ఒకదాని వెంట ఒకటి హృదయంలోనుంచి వచ్చినవే!

రాణీని, ఎలీనా తనింటికి తీసుకువెళ్ళింది. కాఫీ పుచ్చుకున్న తరువాత, ఎలీనా ఇంకా పదేపదే ధైర్యం చెప్పిందేగాని రాణి ముఖంలో చీకటి తెరలు పూర్తిగా పోలేదు.

ఇంటికి వెళ్ళగానే తండ్రి దగ్గరకు వెళ్ళలేకపోయింది. నేరుగా వెళ్ళి తన మంచంమీద పడి వెక్కి వెక్కి ఏడ్చింది — "హుఁ!_ తనకింకా ఆ జిడ్డుతో నానిన తలగడల్లోనే ముఖం దాచుకోవలసిన రోజులు పోవు కాబోలు!

తండ్రి చెబితే ఏఁవిటో తెలివితక్కువ మాటలనుకున్నాది-రాతలో లేనిదానికి ప్రయత్నించినా మిగిలేది కీడేనేమోతల్లీ"_రాణీ చెవుల్లో తండ్రి మాటలు గింగుర్లాడుతున్నయ్.

తండ్రి దగ్గరకు వెళ్ళి బావురుమన్నాది.

"లే తల్లీ నువ్వు తప్పకుండా ప్యాసవుతావు - " అన్నాడు.

"పోతే పోనీ అమ్మా ఇంకో సారి ప్యాసవుదువుగాని" అన్నా రాణీకి దుఃఖం ఆగలేదు.

ఆ రోజున రిజల్ట్స్ పబ్లిష్ అవుతవి.

తెల్లవారుతుండగనే ఆవిషయం జ్ఞప్తికి వచ్చింది రాణికి. వంటపని చూచుకుని ముందుగానే ఎలీనా ఇంటికి వెళ్ళి కూర్చున్నాది. ఎలీనాకి రాణీ ప్యాసవుతుందనే ఆశకూడా బలంగానేవున్నాది. పేపరు వచ్చింది, ముగ్గురూ ఆతృతగా వెతికారు. రాణీ నెంబరులేదు. రాణీకి కళ్ళలోనీళ్ళు తిరిగేయి. అంతవెంటనే కళ్ళు అగ్నిగుండాల్లాగున మారేయి. నిజంగా, విధి, ఖర్మ అనేవి ఆకారాలైవుంటే మాడి మసైపోయేవే.

"ఏమైనాసరే ఇంకోసారి పరీక్షకి వెళ్ళి నెగ్గి విధికి బుద్ధి తెప్పిస్తాను!" అనుకున్నాది.

రాణికి వీడ్కోలు చెప్పి బయటకు వచ్చేస్తుంటే, ఆ దంపతులిద్దరూ విగ్రహాల్లాగు నిలబడిచూస్తుండిపోయేరు ఓ దార్చేందుకు ధైర్యంచాలక.

రాత్రి తొమ్మిది గంటలకు రాణి మేను వాల్చిదిం.

అలసి పోయిన రెప్పలు మూతలుపడ్డయేగాని ఆలోచనా గృహద్వారానికి -తలుపులు పడలేదు. అంతరాత్మ పశ్చాత్తాపంతో కుమిలిపోతున్నాది... మరుక్షణానికే, మొదటిదెబ్బ తిన్న తాచుపాములా బుసలు కొడుతున్నాది. "విధి...పాడువిధి" అని.

మరోసారి 'పరీక్షకి వెళ్ళడంఎలాగు......వెళ్తే మాత్రం లాభం!_క్రిందటి సారి తనకేం స్పీడు లేదు గనుకనా!_అంతా దరిద్రం.

"తనకి ఏ గుమాస్తాగారి చేతిక్రిందనో చెప్పుదెబ్బలు రాసినై అది అనుభవించితీరాలి - అంతే."

తండ్రికి మంచినీళ్ళు ఇచ్చి తిరిగివచ్చి పరున్నాది. కళ్ళు మండుతున్నట్టున్నయ్ పైటచెంగుతడిపి ఒత్తుతున్నాది. "ఖర్మ! ఇంతవరకూ సవ్యంగానడిచి పోయింది. ప్యాసవటంగూడా జరిగి పోకూడదూ!" అనుకుంటూ నిద్రపోయింది.

తెల్లవారింది - ఇంకాబద్ధకంతోనే తనకి జరిగిన అపజయం జ్ఞప్తి తెచ్చుకుంటున్నాది. తండ్రి కష్టంగా నీకు తోచినట్టు చేసుకో అమ్మా అనడం... వెళ్ళి ఎలీనాని కల్సుకోవటం, ముందు నిరాశ, తరువాత నెలనెలా ట్యూషన్ ఫీజు కడతాననటం... పని అయింతరువాత తను తీరుస్తాననటం...తీర్చడం! - రాణికి గుండెలమీద గుద్దినట్టయింది. అన్నట్టు తను ఎలీనాకి ఆ సొమ్మంతా ఎలా తీరుస్తుంది - అరవైరూపాయలు!

బద్ధకమంతా పూర్తిగా వదిలిపోయింది. దుప్పటి ముసుగుతీసేసింది.

పాపం నాన్నని తీర్చమనటమా...ఛా...మళ్ళీ పరీక్షకి వెళ్ళి తనే తీర్చేయాలి...పరీక్షకి వెళ్ళాలి తప్పకుండా...

"ఎలీనా ఏమంత తొందర పెట్టదు...పెళ్ళి అయిం తరువాత ఆయన్నే తీర్చమంటే...సిగ్గు, సిగ్గు. నిన్నటి దాకా తనకి ఆత్మగౌరవం కావాలి, భర్తప్రేమాను రాగాలుకావాలి, స్వతంత్రంకావాలి అన్న తను అప్పుడే భర్త దయకి చేయిజాపుతుంది...ఛీ! ఛీ! వెధవబ్రతుకు...

మళ్ళీ పరీక్షకే వెళ్ళి తప్పకుండా పాసయి, తన కాళ్ళమీదనే తను నిలబడాలి...ఎలీనానే కట్టమనాలి ఫీజుకూడా..."

ఆమధ్యాహ్నమే భోజనంచేసి ఎలీనా ఇంటికి వెళ్ళింది. ఆ దంపతులూ అప్పుడే మార్నింగ్ షో నుంచివచ్చేరు. అందరూ లోపలకు వెళ్ళాక; ఎలీనా భర్త భోజనాలకు లోపలకి వెళ్ళేరు, రాణీ చావిట్లో కూర్చున్నాది.

ఆ చావిడిని చూస్తుంటే రాణీకి వెర్రి ఆనందం, వెర్రిధైర్యం కలుగుతున్నయ్. మూడునాలుగు కుర్చీల మధ్య చిన్న రౌండ్ టేబుల్ ఎంబ్రాయిడరీ కుట్టు పనితో టేబుల్ క్లాతు. దాని మీద ఫ్లవర్ బొకెట్, రెండు పుస్తకాలు వున్నయ్ – రాణీలేచి పక్క గదిలోకి వెళ్ళింది. అది స్వర్గంలా కన్పించింది. దండీ నిండా చీరలమడతలు, ప్యాంట్లు, షర్టులు, కుప్పలు కుప్పలుగా వున్నయ్. ఇంకో పక్కన చిన్న టేబుల్ మీద పెద్దఅద్దం టోయ్‌లెట్ సామాన్లు వున్నయ్.

"అసలు అలావుండటంచేత కావాలి. ఎందుకు ఎంత డబ్బున్నా, ఇనప్పెట్టెల్లోను, మొద్దుబంగారపు వస్తువుల్లోను పెట్టుకుంటారు దయ్యాల్లాగు...ఎలీనాకి ఒక్క నెక్‌లెస్...జతగాజులు; వాచీ, చూడబోతే అప్సరసలావుంటుంది." అనుకుంటుంది.

ఎలీనా తేనుస్తూ బయటకువచ్చింది. "ఏమిటిరాణీ దీర్ఘంగా ఆలోచిస్తున్నావ్;" అన్నాది.

"ఏమిలేదుగాని...నన్ను మళ్ళీ పరీక్షకి వెళ్ళ మంటావా?" అనడిగింది.

"అంటే నీ ఉద్దేశం మానేద్దామనా!"

"మళ్ళీ ఇది కూడా దండుగ ఎందుకు అని"

"ఏడిసినట్టే వుంది, ప్రయత్నించేము అంటే, ఆ పని కొనసాగే వరకూ కష్టపడాలి. నేను S.S.L.C. ఎప్పుడు పాసయ్యేనా, థర్డ్‌ఛాన్సుకి. అలాగే, ఈ సారి కాకబోతే ఇంకోసారి, ఇంకోసారి..."

"ఫీజుకిమళ్ళీ నిన్నే అడిగి బాధ పెట్టాలని... అదంతా ఎప్పుడు తీర్చగల్గుతానో ఏమో!"

"తీర్చద్దుగానిలే- వెధవది డబ్బేగా- మహాభాగ్యం ...అన్నట్టు నీకో సువార్త చెప్పాలనుకుంటున్నాను ...సరేలే ఆయనే వచ్చి చెప్తారు"

"మీ వారా! – ఎందుకు నువ్వుచెప్పేద్దూ!"

ఇంతలో "నమస్తే రాణీగారూ!" అంటూ ఎలీనా భర్తవచ్చేడు.

"మళ్ళీ పరీక్షకి వెళ్తున్నారా!"అన్నాడు.

"ఇంకా ఏమీ తేలలేదండి..."

"దానికేంగాని, నిన్న మీరు, మీ ఆఫీసులో ఏదో టైపిస్టుపోస్టు కాళీగా వున్నాదన్నారు- మానే జర్‌తో మాట్లాడుతానన్నారు." అన్నాది ఎలీనా.

"మాట్లాడేను కాని – రాణీగారూ మీరు రేపొకసారి మా ఆఫీసుకి రండి మళ్ళి చెప్పిచూస్తాను." అన్నాడు.

"నేనే! - నాకా!" రాణీ ఆశ్చర్యపోయింది.

"అఁ; మీకే, - ఇంకోసారి ప్యాసవుదురు గానికాని, ముందు ఎపాయింటుమెంటు మీకోసం సిద్ధంగా వుందండి. అన్నాడు."

రాణీ ఆశ్చర్యానందాలకి మితిలేదు. పరుగు, పరుగున ఇంటికి వెళ్ళి తండ్రితో చెప్పింది కాని ఆయన అంతగా ఉత్సాహాన్ని ప్రకటించలేదు.

## 3

"రాణీ ఉద్యోగంలో ప్రవేశించిన తరువాత, ఆ వేళ మూడోసారిగా తన ఇంటిమేట్ ఫ్రెండ్స్‌ని విందుకి ఆహ్వానించింది.

అందరూ వచ్చేరుగాని రాణీ, రాజు అనే కో క్లర్కు కోసం ఎదురు చూస్తున్నాది. టైము అయిదు అయిపోయిందని, విందు ఆరగించేందు కుపక్రమించేరు. అయిదారుగురు లేడీ టైపిస్ట్సువున్నారు. పదిహేనుమందివరకు క్లర్కు్స వగైరాలున్నారు.

ఎలీనా, ఆ మెభర్త, ఇంటి ఓనరు. కులాసాగా కబుర్లు చెప్పుకుంటున్నారు.

"ఈ సారి - పద్మారాణీగారి మారేజీడిన్నర్ పార్టి త్వరలోనే తగుల్తుందేమో - మళ్ళీసిద్ధంగా వుండాలి మేమంతాను" అన్నాడు ప్రసాదరావుఅనే క్లర్కు నవ్వుతూ.

"మీ దయవల్ల..." అన్నాది రాణి; అతని కళ్ళల్లోకి చూస్తూ

అంతలో అతని హృదయం పొంగిపోయింది ఇంకా ఏదో అనాలనుకున్నా అనలేకపోయేడు.

"అయితే రాణీ గారి మారేజ్ ఈ ఇయర్‌లో డెఫినిట్ అన్నమాట!" టైపిస్ట్ సుబ్బారావు వికటంగా నవ్వుతూ అన్నాడు.

రాణీకి ఎబ్బెట్టుగా తోచింది. తండ్రి బాధ పడ్డాడు.

"ఏమున్నదయ్యా! - మీరంతా యువకులు..." ఇంటి ఓనరు అంటుండగా.

"యువకులమేగాని, ఆవిడకి, నాసినాసిగా వుంటామండి-ఏజీకూడా..."

సుబ్బారావు మాటలు రాణీకి బల్లెంపోటులా వున్నాయ్. ఇంటి యజమాని బుద్ధితక్కువ సంభాషణకి రాణీ ఒళ్ళు ఉడికిపోయింది. వెంటనే సంభాషణ మారుస్తూ, "కొచ్చిన్ కేఫ్‌వాడు స్వీట్ బాగా చేస్తాడుసుమండీ" అన్నాది.

"అందుకనే, వాడికి పార్టీల, డిమాండు ఎక్కువ" అన్నాడు ప్రసాదరావు నవ్వుతూ. విశేషమేమీలేక పోయినా అతనికి రాణీనంకచూచి నవ్వటం అలవాటు. అందుకనే రాణీకూడా నవ్వింది.

విందుపూర్తి అయింది. "రాజుగారు, రానే లేదు" అన్నాది రాణి. సుబ్బారావు అందుకున్నాడు. "అతనికి పార్టీలకి వచ్చేఅంత చురుకుదనం వున్నట్టు కనుపించదు. డల్ ఫెలో - చూస్తున్నానుగా వచ్చి అయిదారు మాసాలయినా, ఎవరితోనూ హెచ్చుగా మాట్లాడడు. సీరియస్‌గా వుంటాడు."

"పోనీలే అతనికి ఇంకోసారి ఇండివిడ్యుఅల్‌గా పార్టీచేద్దుగాని." అన్నది ఎలీనా, అందరూ నవ్వేరు. రాణీకికూడా ఆ మాటలు ఇంపుగానే తోచినయ్యి.

చీకటి దట్టమైంది. మిత్రులందరూ వెళ్ళిపోయేరు.

రాణీ పరుండి వచ్చిన బహుమతులు చూచుకుంటున్నాది. ఒక హాన్డ్ బాగ్‌లో చిన్న లేబుల్ వున్నాది దానిమీద ధర, ఎవరు ఎవరికి ఏ సందర్భంలో ఇచ్చేరో రాసివున్నాది. "బడాయి వెధవ, తుచ్ఛుడు!." "మేము నాసి అయిపోతామండీ" అన్న కుళ్లు మాటల సుబ్బారావుది ఆ బహుమానము. అతనంటే రాణీకి ఒళ్లు మండిపోతుంది. "వెధవ, అంత నాసిరకంగాడు, ఏజిలేనివాడు. తను ఆఫీసులో జేరినవారానికే ప్రేమలేఖ తెచ్చి డస్కులో పెట్టేడు - అయితే అటులేకపోతే ఇటు - నిజంగా నాసిరకం వెధవే. గుర్రం స్వారికి సిద్ధపడేవాడు కళ్ళెంపట్టుకునేంత సమర్థత కల్గి వుండాలిగాని, కాళ్ళదగ్గర పడి ఏడిస్తే ఏంలాభం. మగాడైనందుకు తన గంభీరతతో స్త్రీని ఆకర్షింపజేసుకోవాలిగాని కూడా కూడాబడి తిరిగితే, ఎన్నటికీ ఏ స్త్రీముందైనా నాసిరకమే..."

"చూశావారాణీ!" అన్న రుద్ధకంఠం రాణీని కలవరపెట్టింది

"ఏఁవిటి నాన్నా!" అన్నాది తండ్రివేపుతిరిగి.

"ఏమున్నాది, మొన్న నిన్ను చూచుకునేందుకు వచ్చినవాళ్లు-

ఆవేళ బాగానే మాట్లాడేరు - ఇవ్వాళ చెప్పు పుచ్చుకుకొట్టినట్లు వుత్తరం రాసేరు - 'మాకు ఇష్టం లేదు' అని చూడు"

అట్లాంటి వుత్తరాల్ని ఈ మధ్య అయిదింటినో ఆరింటినో చూచింది. తలవంచుకొని వూరుకున్నాది. అలా సంబంధాలు తిరుగుముఖం పెడుతుండడానికి తన ఉద్యోగమే కారణమని తండ్రి చాలాసార్లు అన్నాడు.

"ఉద్యోగంచేస్తే స్త్రీ ప్రవర్తన చెడుతుందా!- ఎంతమంది ఇంట్లో కూర్చునే తగలడటంలేదూ - వాళ్ల సంగతి!" అనుకున్నాది.

రాణీకి లోకం అంటే నిర్లక్ష్యమేగాని తండ్రి బాధే చూడలేకపోతున్నాది.

రాత్రి నిద్దురపట్టటంలేదు - "రాజు ఎందుకు రాలేదో ... పిల్చినప్పుడు, మీరు పిలిస్తే రాకపోవటమా" అన్నాడు - అతనెప్పుడూ అంతే సీరియస్‌గా వుంటాడు, సిల్లీగా మాట్లాడుతాడు మాట్లాడిన నాలుగు మాటలు. అతనువచ్చి అయిదారు మాసాలయినా అతని తత్వం తనకి బోధపడుటలేదు. అందరిలాగు తనతో మాట్లాడేందుకు ప్రాకులాడడు. తన చూపులకోసం పరితపించిపోడు. రోజంతా తనకి ఎదురుగావుండే టైప్ చేసినా, బహు అరుదుగా తన వంక చూస్తాడు. ఆ చూపే తనని ఒకోసారి స్వర్గానికి తీసుకుపోతుంది మరోసారి పాతాళానికి — ఆ చూపే తన హృదయంలో సుడిగాలులు లేపుతుంది మరో క్షణానికి అమృతం చిలుకుతుంది ... ఏమిటో అతన్ని చూచేందుకు తనే పరితపిస్తుంది ... అసలు ఎందుకురాలేదో తెలుసుకొందుకు మధ్య ఆదివారం ఒకటి. మళ్లీ ఎల్లుండే ... ఇక ప్రసాదరావుని చూస్తే తనకి అపరిమితమైనజాలి. ఎంత అమాయకుడో అంత మంచివాడు, అందగాడేగాని, అతనంటే తనకంతశ్రద్ధలేదు. ...

సుబ్బారావు — వెధవ ... తుచ్ఛుడు, అంటూ నిద్రపోయింది. మర్నాడు ప్రొద్దుటే తండ్రికి పాలు ఇస్తూ మొహంలోకి చూచింది ... పాపం ఆ వృద్ధ హృదయం కుళ్ళిపోతున్నాది. బంధువులు తను ఉద్యోగంచేస్తున్నందుకు ఏవేవో కూస్తున్నారని, వచ్చిన సంబంధాలన్నీ చెడగొడుతున్నారనీ ఆయన బాధ. ... "ఇకమీదట సంబంధాలు రానేరావేమో తల్లీ" అని ఒకసారి తండ్రి కంటతడిపెట్టుకున్నాడు. పాపం ఆయనకి తనో సమస్య అయిపోయింది. కాని తను ఇంక ఏమిచెయ్యగలదు!

సాయంత్రం రాణీ డాబామీద నుంచుని, సముద్రంవంక చూస్తున్నాది. క్రిందినుంచి, "నమస్తే రాణీగారూ" అన్న మాటలు వినిపించినయ్. క్రిందికి చూచింది. రాజు! గబగబా క్రిందికి దిగి రాజుని ఇంట్లోకి తీసుకువెళ్ళింది.

రాలేదు - రాలేదు అనుకున్నాదేగాని ఇవ్వాళ వచ్చింతరువాత ఎలా సత్కరించాలో తెలియక లోపలకు వెళ్ళింది చాలా సేపటికిగాని బయటకు రాలేకపోయింది. ... క్రిందటిదినం అంతమందివచ్చినా ఇంత ఆందోళనపడలేదు.

చివరకి తండ్రికిఅని తెప్పించిన బిస్‌కెట్సు, ఓవల్‌టిన్‌తో సత్కరించింది.

"ఓహో! మీకు మీ క్రిష్టియన్ ఫ్రెండ్ ఎలీనాగారు నేర్పినట్టున్నారే ఈ పద్ధతి" అన్నాడు తమాషాగాచూస్తూ.

రాణీ ఒక విధంగా సిగ్గుతో తలవంచుకున్నాది.

"నిన్న రాలేదేమండి! — ఎంతసేపుచూచేమో— మీరురానిదే ఏమీసరదాగాలేదు" అన్నాది.

"అంతమందిలో ఒక్కగానొక్కణ్ణి రాకపోతే విందు బాగాలేదంటున్నారుగదా, నమ్మదగ్గవిషయమే - అయితే ఏదో విశేషమున్నదన్నమాటే."

"పోనీ నమ్మకండి ... కాని ... నిన్న మీరెందుకురాలేదు, బీదవాళ్ళ ఆహ్వానాలకి రావడము అభిమానంగాబోలు ..."

"నేనేం జమీందారునా, మిమ్మల్ని బీదవాళ్ళనడానికి ... ఆమాటకివస్తే మీరే గొప్పవాళ్లు మగా

ళ్లతో సమానంగా సంపాదిస్తున్నారు ..." అన్నాడు నవ్వుతూ.

రాణీ దెబ్బ తిన్నాది. "దానికేంలెండి. మీరు ఉద్యోగం తోచక చేస్తున్నదేనటగా" అన్నాది.

కాస్సేపు మౌనంగా వూరుకున్నారు.

"అయితే రాణీగారూ! మీకు విజయవాడలో రామయ్యాగారనే మేనమామగారున్నారా" అన్నాడు.

"ఊఁ వున్నారట, నాకే తెలీదు, మీకెలా తెల్సు" అన్నాది.

"మాదీ ఆవూరేలెండి - మొన్న ఏవో పెళ్ళి మాటలంవస్తే నాకోసమని, మీ మాటకూడా చెప్పేరు పెళ్లిసంబంధాలు చెడిపోతున్నయ్ అని ... దానికి మీ ఉద్యోగమే కారణమని ..."

"మీరవన్నీ నా ముందే ప్రస్తావించటం న్యాయం కాదండీ, దయవుంచి ..."

"దయకేమున్నాదండీ, ముందు, ముందు మీదయే మామీద..."

"అంటే అర్థం..."

"మరేమీ లేదు ... మీరీపాటికి గౌరవంగా ఉద్యోగానికి రాజీనామా చెప్పేస్తే, జూనియర్ని కదూ నాకు మీ ప్లేసు వస్తుందని ..."

"చాలించండి ఇంక – ఇదేనా మీ నైజం ... మిత్రుల కీడు ఎంచే తత్వం అనుకోలేదు."

"అనుకోకపోవటం మీ పొరబాటు – కాని భారతీయ స్త్రీలు కనుక సిగ్గు పూర్తిగా విడిచివేయ వద్దని ..."

"రాజుగారూ ఇక మీరీ ప్రసంగం చాలించి బయటకు నడవటం ఉత్తమం, దయచేసి..."

"బయటకుపోయేముందు చిన్న బహుమానం .." అంటూ న్యూస్ పేపర్తో చుట్టబెట్టిన పొట్లం అక్కడపెట్టి వెళ్ళిపోయేడు.

రాణీ మొహం మందార పువ్వులా ఎర్రబడింది. కొంచెం సేపయిన తరువాత, పొట్లంవిప్పి చూసింది. నాలుగైదు కాయితాలు విప్పేక తళతళ మెరిసే నెక్లెస్ చేతిలోకి జారింది ...

దానితో రాణీ మొహం పాలిపోయింది. "ఇంత ఖరీదైన దానిని బహుమానంగా పట్టుకువచ్చేడంటే ఏదో పెద్ద ఏర్పాటుతోనే వచ్చివుంటాడు ... అనవసరంగా తొందరపడిపోయింది తనే ... అయినా అంత చులకన పనికిరాదు, రేపు తీసుకువెళ్ళి అతనికే ఇచ్చివెయ్యాలి" అనుకున్నాది.

ఆ రాత్రి రాణీకి జ్వరం వచ్చింది – మర్నాడు అతన్ని చూచేందుకు అయిష్టపడి సెలవు పెడదామనుకున్నాదిగాని, నెక్లెస్ ఇచ్చేయడానికి ఆఫీసుకి వెళ్ళింది. కాని ఆనాడు అతనే రాలేదు.

రాజు ఆరోజు మధ్యాహ్నం రాణి వుండదనే రాణి ఇంటికి వెళ్ళేడు. రాణి తండ్రి ఏదో పుస్తక కాలక్షేపం చేస్తున్నాడు.

"నమస్కారం మామయ్యగారు" – అన్నాడు చొరవగా ప్రవేసిస్తూ. రాణీ తండ్రి నివ్వెరపోయి. "ఎవరూ! ... రాజారావుకదూ! రా నాయినా రా, ఎప్పుడురాక" అన్నాడు.

"ఇక్కడే వుంటున్నానండి – మీ రాణి చేస్తున్న ఆఫీసులోనే పనిచేస్తున్నాను" అన్నాడు కూర్చుంటూ.

"ఆఁహాఁ!" అన్నాడేగాని ఆయన మొహంలో కత్తిదెబ్బకి రక్తంలేదు." "ఎన్నాళ్ళనుంచి" అన్నాడు.

"అప్పుడే అయిదారు మాసాలనుంచీను."

"అయ్యోయ్యో! ఒక్కసారైనా రాలేదేమోయ్మరి."

"మొన్న ... అన్నట్టు, నిన్ననే వచ్చాను మీరు లేరు. రాణి వున్నాది."

"దానికి తెలియదులే. నువ్వెవ్వరవో – అసలు నాకే..."

"దానికేమిగానండి మీతో ఒక ముఖ్య విషయం మాట్లాడదామని వచ్చాను ... క్షమించాలి."

"ఏఁవిటి నాయనా అంత ముఖ్యం!"

"మీ రాణీని వివాహంచేసుకోనేందుకు స్థిరపరచుకున్నాను ... మీ అనుజ్ఞకూడా..."

రాణీ తండ్రి, ఇది కలా, నిజమా అని సందేహ

పడ్డాడు, తరువాత తనని హేళన చేసేందుకే రాజు వచ్చేడేమోఅనుకున్నాడు. “లాభంలేదు నాయనా-” అన్నాడు.

“ఏమండీ - ఏం” రాజుకి ఆందోళన.

“మీరు డబ్బున్నవాళ్ళు ... మీకు నేనేమంత పెద్దకట్నాలివ్వుకోలేను...”

“అదేంవిటండీ, అవన్నీ నాకు వదిలిపెట్టెయ్యండి, పైగా నాతోపాటు సమానంగా సంపాదించేదాన్ని కట్నంకూడా ఏమడగను! సాధారణంగా పెళ్ళాన్ని పోషించే ఘనకార్యానికేగా, కట్నాలు అడుక్కోవటం...”

“ఏమో నాయనా-నాకిదంతా కలగావున్నాది... దాని అదృష్టంమరి ... మీ నాన్న, అమ్మ...”

“అవన్నీ నాకు వదిలెయ్యండి ... కాని ఈ విషయం మాత్రం ఏమాత్రంకూడా రాణీకి తెలియకుండావుంచాలి, నేను ఇవ్వాళే వెళ్లి త్వరలో అమ్మకి, నాన్నకిచెప్పి ముహూర్తంకూడాపెట్టి పంపిస్తాను - నువ్వుమట్టుకు ఏర్పాట్లు చేసుకుంటూవుండు. ఏ దేముడిగుడికో వెళ్ళి పెళ్లిచెయ్యాలని అమ్మ అనుకున్నాదట అలాగే నడిపిద్దాము — మరి వస్తాను మామయ్యగారూ, రాణీకి చెప్పకండి, ఆవిడకు ఇష్టమే నేనంటే” అంటూ వెళ్లిపోయేడు.

సాయంత్రం రాణి నీరసంగా ఇంటికి వచ్చేసింది. తండ్రినిచూచి ఆశ్చర్యపోయింది. ఆనందంతో కూని రాగాలు తీస్తున్నాడు. అతి నిర్లక్ష్యంగా, లోకాన్ని జయించినట్టు కాలుమీద కాలు వేసుకు కూర్చుని ఆకాశాన్ని చూస్తున్నాడు.

మర్నాడుకూడా రాణీ నెక్‌లెస్ పట్టుకువెళ్లింది ఆఫీసుకి — కాని — నోటీసు బోర్డులో రాజు వారం రోజులు శలవుపెట్టి స్వగ్రామం వెళ్ళినట్లు చూసింది. నీరైపోయింది రాణి మనస్సు. ఇక మళ్లీ వస్తాడో రాడో అన్న బెంగ పట్టుకున్నాది.

తరువాత మూడు రోజులకి రాజు తండ్రి దగ్గర నుంచి ముహూర్తం పెట్టించినట్టు వుత్తరం వచ్చింది. “వచ్చే లక్ష్మీవారమె పెళ్ళి, తిరుపతిలో” అని. ఆ విషయం రాణీకి చెప్పేడు.

ఆ రోజున రాత్రి రాజుని తలచుకొని ఎంతగానో బాధపడింది, ఏడ్చిందికూడాను. మర్నాడు ఎన్ని సార్లడిగినా, వరుడు, కట్నం, ఇత్యాది విషయాలు తండ్రిచెప్పలేదు. రాణీకూడా పట్టుపట్టి అడగలేక పోయింది.

రాణీ పదిరోజులు శలవు పెట్టింది.

ఇటు ఆడపెళ్ళివారు — అటు మగపెళ్ళివారు కొండమీద తారసిల్లేరు. పెళ్ళి వైభవంగా జరిగి పోతున్నాది. అవకాశాలుచిక్కినా పెళ్ళికూతురు, పెళ్ళికొడుకుని చూచేందుకు ఇష్టపడలేదు. కాని, పెళ్ళికివచ్చిన తన బంధువుల్ని చూచి ఆశ్చర్య పోయింది. “వీళ్ళువచ్చేరే” అని.

పెళ్ళి అయిపోయింది.

రైలుదింపి వధూ వరులను పూలకారులో కూర్చోబెట్టేరు. అర్ధరాత్రి నిద్రబోతూ నడుస్తున్నాది, పెళ్లి సమూహం పెళ్ళికొడుకు మెల్లిగా పెళ్ళి కూతురుమెడతడిమి “పుట్టినరోజు బహుమతి ఇచ్చేను అదేదీ” అన్నాడు. రాణీ తృళ్ళిపడ్డాది.

చెంమీక్కదండల్నిపక్కకి తప్పించి “మీరా” అంది భయాశ్చర్యానందాలతో.

“అహఁ! — నేనుకాదు” అన్నాడు దగ్గరకు తీసుకుంటూ.

# సిరిసిరిమువ్వలు

అమ్మమ్మ:- కళ్లులేని బ్రతుకుకంటే చస్తే నయం తల్లీ!

మనుమరాలు:- కండ్లుండికూడ చదువు సంధ్యలు రానివాళ్లు గంతలు కట్టిన గానుగెద్దులలాంటివారు అమ్మమ్మా! ఎన్నాళ్లు బ్రతికినా వారిబ్రతుకు ఎద్దు బ్రతుకే!

♦ ♦ ♦

తండ్రి:- అమ్మాయీ! నీవు మహా అల్లరి చేస్తున్నావు - నాతో సినిమాకు రావద్దు

కుమార్తె - మీతో అమ్మ వస్తుందిగా!- ఆమె వెంబడి నేనువస్తాను.

♦ ♦ ♦

కుమార్తె:-అమ్మా! మా ఆయన శాంత మూర్తి అనుకున్నావు - ఆయనకు ఊరంత కోపమున్నది.

తల్లి:- పోనీలేతల్లీ! - మీది చిన్నపల్లె టూరేకాబట్టి ఆ మాత్రం కోపం ఎంత శాంతమూర్తికైనా యుంటుంది.

♦ ♦ ♦

పనిమనిషి: ఏదో మీ దయ అమ్మా! - పండుగ మామూలు దయచేయాలి.

ఇంటి యిల్లాలు: నాదయ నీకెందుకే! - దేవునిదయయుంటే మరి యింకెవ్వరిని యాచించనక్కరలేదు.

♦ ♦ ♦

ఒక పెద్దమనిషి:- అయ్యా! మీయింట్లో అద్దెకిచ్చే భాగాలేమయినా ఉన్నాయా! మేము భార్య భర్తలం, ఒక పిల్లవాడు మాత్రమే - ఒకగది, వంటయిల్లు అయితే చాలు.

ఇంటియజమాని:- ఖాళీలు లేవండీ!

పెద్దమనిషి:- మీరు ఖాళీ చేస్తేచాలు - మీరున్న భాగం మాకుండానికి సరి పోతుంది.

శ్రీమతి మరువాడ వెంకటరమణమ్మ

---

## కొత్త విటమిన్

ప్రపంచ శాస్త్ర విజ్ఞాన చరిత్రలో మొట్టమొదటిసారిగా సోవియట్ దేశంలో ఆకు పచ్చటి తేయాకులనుండి విటమిన్ 'పి' తియ్యబడింది. ఇదీ దాని కథనం: అకెడిమీషియన్ కుర్సనోవ్, జీవశాస్త్ర విజ్ఞానవేత్త జప్రామెటోవ్ – వీరిద్దరూ తేయాకు రసం (టానిన్) గుణాలను పరిశీలించి అందులో ఎక్కువగా విటమిన్ 'పి' వుందని రుజువుచేశారు. ఈ రసం తేయాకు మొక్కల యొక్క పైనున్న మొగ్గలలో వుంటుంది; అందులో యీ విటమిన్ నూటికి 18 నుండి 35 వంతులుంటుంది.

తేయాకులనుండి విటమిన్ 'పి' తీసే సాంకేతిక పద్ధతిని యీ శాస్త్రజ్ఞులు కనిపెట్టారు; ప్రస్తుతం యీ విటమిన్ ఎక్స్‌ట్రాక్ట్ పరీక్షింపబడుతూంది.

'టాస్'

# దీపంశోకం

శ్రీ ఏకుల శ్రీనివాసులు



అది మహా పట్టణం. ఆ పట్టణ వీధులలో ఎన్నో ధనవంతుల మేడలున్నాయి. రకరకాల లైట్లు వెలుగుతున్నాయి. ప్రతి యింటా దీపపు ప్రమిదలు చక్కగా తీర్చిదిద్దినట్లు శోభగా బారులుతీర్చి నాట్యం చేస్తున్నట్లుగా ప్రకాశిస్తున్నవి. వాటిముందు, వీధిలో వున్న మునిసిపాలిటీ ఎలక్ట్రిక్ దీపాలు వెలవెల బోతున్నాయి. ఈ చిన్న ప్రమిద దీపాలు తమ ఔన్నత్యానికి విలువ లేకుండాచేశాయి, అన్న దుఃఖంతో ఏడుస్తున్నాయా అన్నట్లు కాంతి విహీనంగా వెలుగుతున్నాయి. ఇంతలో - ఒక మునిసిపాలిటి దీపం కెదురుగావుండే యింట్లోనుండి ఒక అబ్బాయి, పరుగెత్తుకుంటూవచ్చి ఒక చిచ్చుబుడ్డి వెలిగించాడు. అదిచూచి మునిసిపాలిటి దీపం చిన్నబోయింది. ఆహా! ఎంత చక్కని పూలు కాంతిగా వస్తున్నవి, ఆ చిన్న బుడ్డిలోనుండి, అని అసూయపడింది. తనకంత అదృష్టంలేదుగదా! అని వాపోయింది. అయితే మాత్రం తన గౌరవానికేం! లోపమా! బజార్లో అంగళ్లముందు రంగు రంగుల, తన సోదర బల్బులు వింతగా ప్రకాశిస్తూవుంటే దారినపోయేవారు వాటినిచూచి ఆశ్చర్యపడడం లేదూ! ఇదెంత, వాటిముందు, కొంతసేపు వెలిగి ఆరిపోతుంది, వెధవ చిచ్చుబుడ్డి, అని తనను, తన జాతిని సమర్థించుకుంది. తక్కిన తన సోదర మునిసిపాలిటీ దీపాలు తన సోదర దీపంయొక్క సమర్థతను మెచ్చుకున్నట్లుగా గర్వంగా దానివంక చూశాయి.

ఇంతలో ఆ యింటిలోనుండి ఓ యువతి, ఆ అబ్బాయి తల్లి కాబోలువచ్చి "ఒరే! రామూ! చెయ్యి కాల్తుందిరా! దూరంగారా" అన్నది.

అబ్బో! ... దానికికూడా నాలాంటి శక్తి వుందన్నమాట, అని దీపానికి కోపం వచ్చింది. మరలా దానిని ఏమీచెయ్యలేక "అసలు ఈ దీపావళిపండుగ నా పాలిట శనిదేవతలాగున్నది. లేకపోతే, నాకంటే ఆకారంలో చిన్నది, నన్ను యింత పెద్ద దీపాన్ని వెక్కిరించేటంతటి వస్తువులను తయారుచేసి ప్రతి ఏటా నన్ను అవమానపరుస్తుంటోంది" అని దీపావళి మీద తన అక్కసు అంతా వెళ్లగక్కింది. "అయినా ఆ చిచ్చుబుడ్డి చెయ్యేం కాలవగలదు. అంతేగా! తను అనుకుంటే షాక్ తగిలించి ప్రాణాలైనా తీసెయ్యగలదు" అని సగర్వంతో అనుకుంది.

ఇదంతా ఏమీలెక్కచేయనట్లుగా ఆ చిచ్చుబుడ్డి తేజోవంతంగా ఉవ్వెత్తున కాంతి కిరణాలు కురిపించి ఆ దీపాన్ని వెక్కిరించినట్లు ఆరిపోయింది.

ఇదిచూచి ఆ దీపం "పాడు జీవితమూ యవ్వనం మూడునాళ్ల ముచ్చటలోయి" అన్నట్లుగా పక్కున నవ్వింది.

ఆ నవ్వువిని చిచ్చుబుడ్డి "నేనుపోతేపోయాను. మా అన్నలూ, తమ్ముళ్లూ యింకా వున్నారుగా! దీనిపని పడతారుగా" అని అనుకుంది ధీమాగా.

ఆ అబ్బాయి మరలా ఓ పెద్ద కాకరవత్తి వెలిగించాడు. కనులపండువుగా పూలు రాల్తుంటే దీపం తన్నుచూచి వెక్కిరిస్తున్నట్లుగా కించపడింది. ముఖం దిగాలుపడింది.

ఇంతలో యింతకుముందు కాలిన చిచ్చుబుడ్డి దారినపోయేవాడి కాలిక్రిందపడి చుర్రున వేడిగా అంటించింది. వాడు అబ్బా అని అరిచాడు. ఆ అరుపు దీపానికి తొట్రుపాటు కలిగించింది. "ఇప్పుడు చూశావా నా ప్రతిభ" అని చిచ్చుబుడ్డి, తనను ఎత్తిపొడుస్తున్నట్లుగా భావించింది. దీపం మరలా ధైర్యం తెచ్చుకొని ఆ పిరికి భావాలను దూరంగా త్రోసిపుచ్చి "ఇది మనలను ఏంచెయ్యగలదు" అన్న ధీమాతో ఓ చిరునవ్వునవ్వి వూరుకుంది.

మరలా ఆ అబ్బాయి ఒక విష్ణుచక్రం వెలిగించాడు. అది గిర్రున తిరుగుతోంది. దీపం అటూ

యిటూ తిరుగులాడింది. ఇదేసమయం అనుకుని చిచ్చుబుడ్డి "అదేమిటి? మా బావమరిది విష్ణుచక్రం దెబ్బకు వణుకుచున్నట్లున్నావే?" అన్నది వెటకారంగా.

''అబ్బే! నేనేమిటి? దానికేమిటి? భయపడటమేమిటి? మీరు వందమంది కలసివచ్చినా నేను భయపడను. మా పెద్దన్నయ్య వాయువు నను చూచిపోవటానికి చాలా ఆతృతతో పరుగెత్తుకొచ్చాడు. దానివలన నేను సంతోషంతో అటూ యిటూ ఆనంద డోలమాలికలలో వూగాను. కానీ మిమ్మల్ని చూచి కాదు. నన్నీ విధంగా అవమానపరిచిన నిన్ను వూరికే విడిచిపెట్టను. ఉండు నీపని చెబుతా. మా మేనత్త కొడుకు వరుణున్ని పిలిచానంటే మీపని అవుతుంది." అని వరుణున్ని ఎలుగెత్తి పిలిచింది. పిలిచిందే తరువాయిగా వరుణుడు పరుగెత్తుకుని వచ్చాడు. తిరుగుతూవున్న విష్ణుచక్రం వానదెబ్బకు తట్టుకోలేక ఆరిపోయి టపీమని ఆగిపోయింది. దీపం సహజమైన గర్వంతో ఓ అస్పష్టమైన నవ్వు నవ్వింది. చిచ్చుబుడ్డికి ఎక్కడలేని కోపం వచ్చింది. ఈ దీపం పని యిలా కాదు, దీనికి తుదముట్టా గర్వం అణచాలని యింట్లోవున్న తన పెదతండ్రి "ఆటంబాంబుకు" కబురంపింది. దీపం తనకేం భయం, పిలుచుకుంటే పిలుచుకో అన్నట్లుగా ఓ కోరచూపు చూసింది.

ఆ అబ్బాయి పరుగెడుతూవెళ్ళి ఓ ఆటంబాంబును తీసుకొనివచ్చి వెలిగించాడు. వెనిగించడమే తరువాయిగా, వర్షం కురుస్తున్నా, దానితో తనకు లెక్కలేనట్లుగా, అది ఢమాలుమని శబ్దంచేసింది.

ఆ శబ్దానికి పక్కయింటిలో వున్న ఓ చంటిపాప కెవ్వున కేకవేసింది. దీపానికి గుండెలు వేగంగా కొట్టుకున్నాయి. తన కాధారమైన ఆ యినుప స్తంభం వూగులాడుతున్నట్లనిపించింది. ముచ్చెమటలు పోశాయి. మైకం కమ్మింది. కళ్లు మూసుకుపోయాయి. టపీమని క్రిందపడి ముక్కలుముక్కలుగా విరిగి వూరుకుంది.

తక్కిన మునిసిపాలిటీ దీపాలు, తమ సోదరదీపం యొక్క విచ్ఛిన్నతనుగూర్చి వాపోతూ, విచారంగా కాంతివిహీనంగా, దాని ఆత్మశాంతికోసం ప్రార్థిస్తూ వెలుగుతున్నవి. ఆ పరిస్థితిచూచి చిచ్చుబుడ్డి వర్గాలు ఆటంబాంబును కొనియాడుతూ, మితిలేని సంతోషంతో కేరింతలుకొట్టాయి. వాటినిచూచి, వాటి చుట్టూచేరినపిల్లలు ఆనందంతో ఘల్లంతుగా నవ్వేరు. ఒకతనువచ్చి రోడ్డులో ముక్కలై విరిగిన గ్లాసు పెంకులను తీసి, కుప్పతొట్టిలో వేసేడు.

అన్నగారైన వాయువు, మేనత్తకొడుకు వరుణుడు దీపానికి సానుభూతి చూపిస్తూ, హోరుగా గాలి వీస్తుంటే, జోరుగా వర్షం కురిసింది. రేడియోలో "కలయిదనీ, నిజమిదనీ, తెలయదులే బ్రతుకింతేనులే" అనే పాట కమ్మగా, సన్నగా వినవస్తోంది.

# మన దేశంలో కోకో ఉత్పత్తి

భారత దేశంలో 'కోకో' ఉత్పత్తికి క్రమంగా అవకాశాలు మెరుగగుచున్నవి.

ఒకప్పుడు 'కోకో' ఉత్పత్తిలో అగ్రస్థానము నాక్రమించియుండిన పశ్చిమ ఆఫ్రికా యీ నాడు ఆస్థానాన్ని కోల్పోడానికి అచ్చటి కోకో పైరులకు ఆశించిన వివిధ జబ్బులే కారణము. ఈ సందర్భమున యితర దేశాలు త్వరిత గతిన కోకో ఉత్పత్తిని, వ్యాపారాన్ని పెంపొందించుకుంటున్నవి.

మన దేశంలో నిర్ణీత దక్షిణ ప్రాంతాలలో ముప్పైఏసంవత్సరాలనుండి విజయవంతంగా కోకో పైరుచేయబడుచున్నది. అనుభవాన్ని బట్టి మద్రాసు, ఆంధ్ర, తిరువాన్కూర్ - కొచ్చిన్, మైసూరు కొండల ప్రదేశాలలో ఉత్పత్తినధికంచేయడానికి అవకాశాలు విరివిగా కనుపిస్తున్నవి. దానికనువైన శీతోష్ణస్థితి 50° F నుండి 100° F వరకు; వర్షము సంవత్సరము మొత్తముమీద 60 అంగుళాలనుండి 80 అం.-అరటి, కాఫీ, రబ్బరు తోటల కనువైన నేలగానున్నచో 'కోకో' విస్తారముగా పైరగును.

'ICOAR'

# తెల్ల రోజా!


రచయిత్రి: ఇన్‌గే షోల్స్

అనువాదము: డాక్టరు వి. ఎన్. శర్మ


(సెప్టెంబరు సంచిక తరువాయి)

హాన్స్ స్వభావరీత్యా ఇతర్ల విషయాల్లో అనవసరంగా జోక్యం పుచ్చుకొనేవాడు కాదు. నాజీ ఉద్యమం దేశ శాంతికి, దేశ కల్యాణానికి స్థాపింపబడిందనే ప్రచారాన్ని నమ్మాడు. హిట్లరు అవతార పురుషుడని, ఆయన అవతరణమూలంగానే జర్మను సంస్కృతి, జర్మను నాగరకత బాగుపడుతుందని స్కూల్లో పంతుళ్లు చెప్పిన మాటల్ని తూ.చాగా విశ్వసించాడు. అందుచేతనే నాజీ బాల సంఘంలో చేరాడు. శాయశక్తులా నాజీ ఆశయాల్ని తన పంథాలోనే ఆచరణలో బెట్టడానికి ముందంజ వేశాడు. నాన్నకి నాజీలు గోముఖ వ్యాఘ్రాలని తెలుసు. రాజకీయాల్లో మనం జోక్యం పుచ్చుకోడం మంచిదిగాదని నాన్న హాన్స్‌కు చెప్పాడు. తమ్ముడు వేర్నరుకి చెప్పాడు. మా అక్క చెల్లెళ్ళకీ చెప్పాడు. ఆ నాటి ఉద్రేకంలో నాన్న మాటల్ని వినేటంత ఓపిక, సహనం మాకు వుంటేగా! నాజీ యుద్యమముపట్ల వైముఖ్యాన్ని చూపే వారందరూ దేశద్రోహులు; జర్మను జాత్యభ్యుదయానికి వేరుపురుగులనే భావంలో తర్ఫీతుఅయిన మేము నాన్న సలహాకి చిర్రెత్తిపోయాం. నాన్నతో పూర్వపు రోజులకిమల్లె చనవుగా మాట్లాడిన వారమే కామని చెప్పినా వింతేమీ వుండదు.

హాన్స్ ఈ సంఘటన మూలంగా కళ్లు తెరిచాడు. యువక సంఘం నాయకుడు హాన్స్‌లో జరిగిన ఈ మార్పుని చూశాక మండిపడ్డాడు. సంఘంలోనే సభ్యుడుగా వుండడానికి అనర్హుడని హాన్స్‌ని యువక సంఘంనుంచి బహిష్కరించాడు. వాడితో ఇతర పిల్లలు మాట్లాడకూడదని కట్టుదిట్టాలుచేశాడు. ఇవన్ని ఒక విధంగా హాన్స్‌కి తన జీవితాశయాలను, ఆదర్శాల్ని చక్కగా అర్థంచేసుకొనడానికి సహాయపడ్డవనే చెప్పవచ్చు.

నాజీలశక్తి అగ్ని పర్వతాల శక్తివంటిది. దీన్ని పెద్దవాళ్లలోనేకాదు, చిన్న చిన్న నాయకుల్లో చూడవచ్చు. నాజీ తత్త్వాన్ని తటపటాయించక నమ్మే సభ్యుల్లోకూడ గుర్తించవచ్చు. అగ్ని పర్వతం తన పనిని చేయడానికి ప్రారంభించింది. మంటలు భగభగమండుతూవున్నాయి. వాటిని ప్రతిఘటించిన వాళ్లను గుటకాయిస్వాహాచేయసాగాయి. ఆ పనిలో దయాదాక్షిణ్యాలులేవు. తమపట్టు నెగ్గాలి. దానికోసం ఎట్టిపద్ధతిని అవలంభించినా తప్పేమీ లేదు అనే పంథాలో నాజీలు నడువసాగారు. ఆ మంటలలో ఎంతమంది అమాయకులు, నాజీలకన్నా వెయ్యింతలు దేశాన్ని, ప్రజాకోటిని ప్రేమించిన జర్మనులు హుతం కావలసివచ్చిందో ఇక చెప్పడం అనవసరం.

పరిస్థితులు విషమించాయి. బయట శాంతి శూన్యం. ఇంట్లోకూడా అంతే. జర్మనులు అనాది నుంచి శాంతిని నిలువబెట్టడంలో ఎట్టి త్యాగాన్ని చేయడానికి వెనుకంజవేసినవారు కారు. హిట్లరు రాజ్యానికి వచ్చాక, దేశం తారుమారయింది. నాజీ ఆదర్శాలని నాజీలే మరచిపోయారు. వాటిని స్వలాభానికీ వుపయోగించుకొంటూ తమ మార్గానికి అడ్డు వచ్చినవారిని వాళ్లు పెట్టిన కష్టాల్ని తలుస్తూవుంటే గుండెలు గభీలుమంటాయి.

నేడు దేశం నాజీలది. వాళ్లకు వున్నంత అధికారవాంఛా! - మా దేశచరిత్రలో ఎప్పుడూ ఇట్టి వాంఛను గురించి, ఆ వాంఛను సాధించడానికి వాళ్లు ప్రజాకోటికి పెట్టిన బాధలను గురించి, చదివిన వాళ్ళంకాము. ఆ వాంఛను సాధించడానికి ఆధునిక

శాస్త్రపద్ధతులన్నిటిని యథేచ్ఛగా వినియోగించారు. అధికారంవాళ్ళది. మా దేశం వాళ్ళ కట్టుదిట్టాల క్రింద వుండాలసివచ్చింది. ఈ నాజీలు ఆడించేఆట! పాడించేపాట. వాటిని నిరాకరించిన వారందరూ దేశద్రోహులు. రాజద్రోహులు. ఆ అపరాధం కోసం ఎప్పుడు నాజీ పోలీసులు ప్రత్యక్షమవుతారో, అమాయకుల్ని ఎక్కడికి అమాంతంగా తీసుకోని వెళ్ళుతారో, ఎవరికి తెలుసు! ఇరుగు పొరుగుల వారికి ఆ సంగతి తెలియదు. అథవా తెలిసినా నోరు తెరచి ఆ సంగతి ఇతర్లకు చెప్పడానికి వారికి ధైర్యం, సాహసం వుంటేగా!

ఇల్లు జైలు. బయటా అంతే. అదీ నరకకూపాని కన్నా అధ్వాన్నమైంగి. ఆ నరక కూపంలో పడ్డ వాళ్ళు తిరిగి వస్తారా? రావడానికి వీలున్నా ఎప్పుడో ఎవరికి తెలుసు. పత్రికలు ఆ సంగతిలో మానవ్రతం ధరించాయి. న్యాయస్థానాల్లోకూడా ఇంతే.

మాకు తెలిసినవాళ్ళు ఎంతోమంది స్త్రీలు, పురుషులు, వృద్ధులు, యువకులు ఈ పంథాలో మాకు తెలియకుండా మాయమయిపోయారు. వాళ్లు జైళ్ళలో పడుతూ వున్న బాధలను గురించి విన్నాం. అవి సామాన్యమైనవైతేగా! యుద్ధకాలంలో అట్టి దారుణ సంఘటనలు జరగడానికి వీలులేదు. నాజీలు కాలాంతకులు. ప్రజాకోటిలో ఎవరు తమవాళ్లో, తమ మార్గానికి వ్యతిరేకంగా పనిచేసేవాళ్ళు ఎవరో నాజీ ముఠాకి బాగా తెలుసు.

మా పంతులు మంచి మనిషి. పెద్ద పరీక్షల నిచ్చిన వాడు. ఆయన కున్నంత దేశభక్తి జాత్యభిమానం ఆ వుత్సాహం, వుద్రేకం ఇతర్లలో కనబడడం కష్టం. నాజీ ఆశయాలపట్ల సానుభూతిగలవాడే. కాని ఆయన పాతసాంప్రదాయాల్లో పుట్టి పెరిగినవాడు. దేశాన్ని ప్రేమించమని, దేశంకోసం అందరూ త్యాగంచేయడానికి సర్వావస్థల్లో సిద్ధంగా వుండాలని ఆయనవాదం. ఆయనే మాలో ఇట్టి స్వాతంత్ర్య బీజాల్ని నాటాడు. హిట్లరు పేరుతో, చిల్లర నాయకులని దేశమంతటా చెలామణి అవుతున్నవాళ్లు అమాయకులకు తెచ్చిపెడుతూవున్న గొడవల్ని చూసి. పంతులు సహించలేకపోయాడు. అలా చేయడంవల్ల జర్మనుజాతి పేరు, ప్రతిష్ఠలకి కళంకం ఆపాదించినవారమవుతామని ఆ పద్ధతి నాజీ యుద్ధానికే ప్రమాదకరమని మా వూరి నాజీ నాయకునితో సాహసించి అనేశాడు. నాయకుడు ఆ సలహాని మన్నించే స్థితిలోవున్నాడా! ... పాపం, పంతులుని స్కూలు పిల్లల ముందర అవమానంచేశాడు. ఉద్యోగాన్నుంచి తీసివేశాడు. .. ఆ సంఘటన జరిగినరాత్రి పంతులు మాయమయ్యాడు. మరునాడు ప్రొద్దున పంతులు ఇంటికివెళ్లి ఆయన తల్లికి మా సానుభూతిని తెలిపాం. బావురుమని ఏడ్చింది. "ఆయన ఏంచేశారని వాళ్లు అలా తీసుకొనిపోవడం?" అని అడిగాం. ఆవిడ కంటతడి పెట్టుకొంటూ "ఏంతప్పచేశాడా? వాళ్ళ పద్ధతుల్ని మార్చుకోనమని అన్నాడు. ఇది వాళ్ళ దృష్టిలో పెద్ద తప్పు. రాజద్రోహం" అని నెమ్మదిగా, జాలిగా చెప్పింది.'

ఎటు చూసినా మంటలు! వాటిని ఆర్పడానికి మన తరమా? లోకంలో ఇంతవరకు కీర్తికాంతుల్ని నిలువబెట్టుకొని ధన్యతగాంచిన జర్మను దేశానికి, జర్మను ప్రజకు, పతనం ఆరంభమయింది. ఈ పతనం మూలంగా జర్మనుజాతి నామావశిష్టమైపోతుందా? లేక పూర్వపు పేరు ప్రతిష్ఠల్ని నిలుపుకొంటుందా? భవిష్యత్తే ఈ సంగతిని నిర్ణయిస్తుంది. లోకులందరూ సుఖంగా బ్రతకాలి, ఒకర్నొకరు ప్రేమించాలి, ఆదరించాలి, సహనం చూపాలి అనే తత్త్వాన్ని ఏ అగ్ని పర్వతం, ఏ సుడిగాలి నాశనంచేయజాలదు. తాత్కాలికంగా ఈ విషమావస్థని ధైర్యసాహసాదులతో ఎదుర్కొనాలి.

నాజీలే ఈ రహస్యాన్ని అవగాహనం చేసుకొని వుంటేనో కాలచక్రం మరో మార్గాన తిరిగి వుండేది. కాని అంత భాగ్యం వాళ్ళకి వుంటేగా! పైపై పటాటోపంలో తమే గెలిచామని జయనినాదాలు చేస్తూవున్నారు. కాని చేతులార తమ నాశనానికే

గోతుల్ని త్రవ్వుకొంటున్న సంగతిమాత్రం వాళ్లు గ్రహించజాలకపోయారు. ఆ అధికారమందలో ఆ రహస్యాన్ని వాళ్లు ఎలా తెలుసుకో గలుగుతారు పాపం? ...... ఈ రోజుల్లో అందరూ మాట్లాడుకొనేది జైళ్ళనిగురించి. ఇవి మామూలు జైళ్ళు అయితేగా! వీటిని కాన్‌సెన్‌ట్రేషన్ క్యాంపులని పేర్కొనసాగారు. యుద్ధకాలంలో అట్టివి తాత్కాలికంగా నెలకొల్పడం మాకు తెలుసు. కాని యివి యుద్ధపు రోజులుకావే. జర్మనుదేశంమీద ఎవరూ దాడి వెడలినవారు కాదే. అవి శాంతిదినాలు. వాణిజ్య వ్యాపారాలు చక్కగా జరుగుతూ వున్నాయి ... నాన్నతో ఇట్టి విషయాన్ని గురించి తెలుసుకొనడానికి మాట్లాడడం అదే మొదటిసారి. నాన్న ఆ క్యాంపులను గురించి ఎన్నో సంగతుల్ని చెప్పాడు. ఆ సందర్భాన నాన్న ఇలా అన్నాడు.

"మనవాళ్ళు మనల్ని అధఃపతాళానికి లాగుకొనిపోతూవున్నారు. ప్రజాకోటికి ఈ సంగతి తెలియదు. నాయకుల మాటల్ని నమ్మి వాళ్ళకి పెత్తనాన్ని ఇచ్చారు. ఫలితం మనదేశం ఇట్టి విషమావస్థలో వుక్కిరిబిక్కిరి అయిపోనాలసి వచ్చింది. దీని మూలాన మనకు శాంతిలేదు. సుఖంలేదు. మన స్వాతంత్ర్యాన్ని మన్నుపాలు చేసుకొన్నాం. పూర్వకాలంలో మన జాతి ఎన్నోసార్లు దెబ్బల్ని తినాలిసి వచ్చింది. కాని అవి వేరు. నేడు మనం అనుభవిస్తూ వున్న ఈ గొడవ వేరు. వాళ్ళకేంపట్టె! ప్రజాకోటి తమ పక్షాన వుందని వీరనాదాల్ని చేస్తూవుంటారు. ప్రజల్ని నడిసముద్రంలో ముంచివేస్తూ వుంటారు. అందులో వాళ్ళకు వచ్చేనష్టం ఏం వుంది? అన్నిటినీ భరించడానికి మనం వున్నాంగా?" అని నాన్న ఈ నూతన వాతావరణం మూలంగా దేశం నేడు ఎదుర్కొంటున్న దుర్భరావస్థని గురించి మాకు తెలియని విషయాల్ని ఎన్నిటినో చెప్పాడు.

"నాన్న! హిట్లరుకి దేశం ఇలా అధ్వాన్నమై పోతున్నదనే సంగతి తెలుసా?" అని అడిగాను.

"ఆయనకి బాగా తెలుసు. కాని ఏం చేయగలుగుతాడు. ఈ సుడిగాలిని ఆపడానికి? ఈ పనిని చేస్తున్నవాళ్ళు ఆయన మనుషులే. వాళ్ళనే ప్రతిఘటించాడా, తన భవిష్యత్తు ఏమవుతుందో ఆయనకి బాగా తెలుసుగా? -- అంచేతనే హిట్లరు ఈ విషయంలో పాపం, మూభావంగా వుండాలసివచ్చింది." అని నాన్న అన్నాడు.

"అలాగయితే ఇక ప్రజాకోటి కర్తవ్యమేమిటి?" అని అడిగాను.

"అదే పెద్ద ప్రశ్న. ప్రజలు ఈ విషమావస్థలో ఏం చేయగలుగుతారు? పుట్టడం, గిట్టడం ఇట్టి దుర్భరావస్థల్ని ఎదుర్కొనడానికే కదూ? మన రాజకీయ పరిస్థితులు మన దేశాన్ని ఇట్టి విషమావస్థలోకి తీసుకొని వచ్చాయి. మొదటి ప్రపంచపు యుద్ధంలో మన దేశం పెద్ద దెబ్బతిన్నది. తరువాత సంధి జరిగింది. నామకార్థం మాత్రమే దానిని సంధి అనాలి. దరిద్రదేవత యధేచ్ఛగా మన జాతిని గగ్గోలు పరిచింది. నిరుద్యోగ సమస్య — పనిపాటలు వుంటేగా ఈ సమస్యని తేల్చడానికి? తరువాత చీకటి రోజులు ఆరంభమయ్యాయి. రాజకీయ పార్టీలు ప్రజలను పెట్టిన బాధలు ఇక చెప్పాలా? ముందుగొయ్యి. వెనుక నుయ్యి. ఎటు నడిచినా ప్రమాదమే. అందరూ జోరుగా వాగ్దానాలు చేసేవారే. కాని ... వాటిని వినలేక ప్రజాకోటి మరో మార్గానికి దాసానుదాసురాలు కావలసివచ్చింది" అని నాన్న జవాబిచ్చారు.

"హిట్లరు నిరుద్యోగ సమస్యని తేల్చి దేశాన్ని మంచిమార్గాన నడిపిస్తానని చెప్పాడు. ఆ మాటను హిట్లరు తూచాగా నెరవేర్చాడు కదూ?" అని నేను నాన్నతో అన్నాను.

"అవును. అలా వాగ్దానం చేశాడు. ఆ వాగ్దానాన్ని చాలావరకు నెరవేర్చాడుకూడా! కాని దీనిని పరిష్కరించడంలో ఆయన అవలంభించిన పద్ధతిని దూరదృష్టితో ఆలోచించాలి. ఆయన అందరికీ కడుపార భోజనం బెట్టడానికి, చేతినిండా పని చూపడానికి యుద్ధ పరిశ్రమలని ఆరంభించాడు. అది నిప్పుతో చెలగాటం. సైనికుల్ని కోట్లకొలదిగా తయారుచేశాడు. వారికోసం ప్రతిచోటా శిబిరాల్ని నిర్మించాడు... అంటే మనం ఏమార్గాన నడువబోతు

న్నామో తెలుసా?...... ఈ పనిని మానేసి ప్రజల ఆత్మశాంతికి అవసరమైన పరిశ్రమలను, కర్మాగారాలని నెలకొల్పివుంటే పరిస్థితులు మరో విధంగామారి వుండేవి ... కాని నియంతలు నియంతలు. వాళ్ళకి కావలసింది అధికారం. అధికారం వచ్చాక దానిని ఎలా నిలుపబెట్టుకోవడం అనే ధ్యాసనుంచి వాళ్లు బయటపడగలుగుతారా? సామదాన భేద దండోపాయాలను వినియోగించడానికి ఏమాత్రం జంకే ఘటాలుకావు. హిట్లరు ఈ సుడిగుండంలో పడి పోయాడు. మనల్ని తనవెంట ఇలా అధోగతిలోకి లాగుకొని వచ్చాడు."

అని నాన్న అప్పటి పరిస్థితులనుగురించి మేము తెలుసుకోవలసిన విషయాల్ని ఎన్నిటినో తెలిపాడు. పూర్వం నాన్నను చూస్తే ఈ సమస్యలనుగురించి ఆయనతో చర్చించడానికి జంకేవాళ్ళం. ఆయన పూర్వాచార పరాయణుడు. కొత్తకొత్త పద్ధతులూ, సిద్ధాంతాలూ అంటే నాన్నకి తలనొప్పి. మేము కొత్త వాతావరణానికి సంబంధించిన వాళ్లం. మా వుత్సాహంలో, మా వుద్రేకంలో, మా పద్ధతులే మంచివనీ, అవే మా పురోభివృద్ధికి అన్ని విధాల సహాయ భూతంగా వుండగలవని మా నమ్మకం. హిట్లరు యువక సంఘంలో చేరడానికి కారణం– ఇందు మూలానే. యువక సంఘం ఆదర్శాలు ఈ విశ్వాసాన్ని మాలో శాశ్వతంగా నిలువబెట్టడానికే ఉద్దేశించబడ్డాయి. కాని మా నాయకులు వీటిని అర్థం చేసుకొంటేగా? తాము పట్టిన కుందేలుకు మూడు కొమ్ములున్నవనే వాదించే మహానుభావులు. అంతేనా? తమవాదాన్ని సమర్థించడానికి ఎట్టిపనినైనా తటపటాయించక చేయడానికి సమర్థులు. ఈ విషయంలో తమవారు పరాయివారు అనే వ్యత్యాసాన్ని పాటించేవారు కారు. తమ భావాలకి అనుగుణ్యంగా వుండని వారందరూ తమ శత్రువులు. వాళ్ళని ఏ విధంగానైనా హతమార్చాలి. అప్పుడే తమ ఆశయాలు నిరాఘాటంగా కొనసాగడానికి అవకాశముంటుంది ......

ఇట్టి వాతావరణంలో పెరిగాం. మా వుద్రేకంలో నాన్నని ఆ రోజుల్లో అర్థం చేసుకోలేకపోయాం... ఇప్పుడో! హౌస్‌లో ప్రతిరోజూ రేగిపోతూవున్న మార్పును చూస్తూవున్నాం. మాకు తెలిసిన వారెంతమందో ప్రతిరోజూ మాయమవుతూ వుండడం చూస్తూవున్నాం. నాయకుల్లో పెద్దనాయకుల్లో, చిన్ననాయకుల్లో, ప్రతిదినమూ పెరిగిపోతూవున్న స్వార్థపరతని, తమ పద్ధతుల్ని సమర్థించని వాళ్ళపట్లగల అసహ్యతను, చూస్తూనేవున్నాం. మన దేశం ఇలా మారిపోతూవుంటే ఇక మన భవిష్యత్తు ఏ రూపాన పరిణమిస్తుందో ఎవరికి తెలుసు. మాలో అలజడి ఎక్కువైపోతూవుంది. మా స్నేహితుల్లోకూడా ఈ సంక్షోభాన్నే చూస్తూవున్నాం. ఇట్టి పరిస్థితుల్లో నాన్నని అర్థం చేసుకోవడం సులభం. నాన్న మితభాషి. తన భావాల్ని సమర్థించడానికి ఏ మాత్రం పటాటోపం చేసే మనిషికాదు. ఈ సందర్భంలో నాన్న మాకు పెన్నిధి అయ్యాడు. మేం అడిగినవాటికి జవాబిస్తూ మా పరిసరాల వాతావరణాన్ని మరో దృక్పథంలో అవగాహనం చేసుకోవడానికి ఎంతో అవకాశాన్ని ప్రసాదించాడు. ఒకరోజున మేమడిగిన ప్రశ్నలకు జవాబిస్తూ "మీరూ ఈ జీవితరథాన్ని సూటిమార్గాన నడుపుకోవడానికి శాయశక్తులా ప్రయత్నించండి. దోవ ఎగుడు దిగుళ్ళతో వుంటుంది. కాని సాహసంచేసి ముందుకు నడవాలి. అలా చేయడంలో ఎన్నో కష్టాల్ని ఎదుర్కొనవలసివుంటుంది అయినా ఫరవాలేదు. జయం మీదే" అన్నాడు. ఇందులో ఎంతో గూఢార్థం వుంది ......

ఆ రోజునుంచీ నాన్నని మా మిత్రునిగా భావిస్తూ మనసిచ్చి నాన్నతో సంభాషించడానికి ప్రారంభించాం. నాన్న మమ్మల్ని ఆ పంథాలోనే చూస్తూ మాకు తెలియని విషయాల్ని ఎన్నో చెబుతూ నిజంగా మా స్నేహితుడయ్యాడు. మా గురువయ్యాడు. మా నాయకుడయ్యాడు. దాంతో ఇల్లు ఆదర్శ కుటుంబంగా మారిపోయిందనే అనాలి...

దేశం మారిపోయింది. నాజీనాయకులు దేశం తమ అడుగుజాడల క్రిందేవుందని, ఇక తమ ఏకఛత్రాధిపత్యం కొనసాగడానికి ఏ మాత్రపు అవాంతరాలూ వుండవనీ భ్రమసిపోతూవున్నారు. కాని వాళ్ళ గోతుల్ని వాళ్ళే త్రొవ్వుకొంటున్నారనే సంగతి, పాపం వాళ్ళకు తెలిసిందికాదు.

(సశేషము)




సీరియల్ కథ

# విజయలక్ష్మి

శ్రీ పిళ్ళా సుబ్బారావుశాస్త్రి

(గతసంచిక తరువాయి)

"అబ్బే ...! నేను రాక్షసినికాను. నేనూ నీలాటి అమ్మాయినే...! నువ్వెవరివి" అని తిరిగి ప్రశ్నించింది విజయలక్ష్మి.

"నేనా? నేను ఒక రాజకుమార్తెని ...! నా పేరు వింధ్య..."

"ఇక్కడి కెలా వచ్చావేమిటి?"

"ఏముందీ! - ఒక రోజు నేనూ, నా చెలికత్తెలూ తోటలో ఆడుకొంటూ వుండగా పెద్ద సుడిగాలివచ్చింది ....! అమాంతం గాలిలోకి ఎగిరిపోయాను! తర్వాత యేంజరిగిందో, నాకు ముఖంతిరిగిపోయి మూర్ఛపడిపోయాను. తిరిగి తెలివి వచ్చేసరికి యీ పరుపుమీద వున్నాను!"

"మరి, రాక్షసి అంటావేమిటీ?"

"ఓ, అదా! ఈ భవనం ఎవరిదనుకున్నావ్? ఇది ఒక రాక్షసిది! దాన్ని చూస్తేనే భయంవేస్తుంది ....!"

"ఆఁ ... అలాగా? — మరి మనని అదెందుకు తీసుకొచ్చిందీ?"

"అదేమో ...! మరి నువ్వుకూడా సుడిగాలిలోనే వచ్చేవా?"

"ఉఁ!నాతోరా...!" అంటూ విజయలక్ష్మి వింధ్యని తీసుకొని ఆ గదిలోవున్న 'కాళీ' విగ్రహం దగ్గరకి వెళ్ళి బొడ్డులో పొడిచింది. మామూలుగానే మరోగది లోకి ద్వారంవుంది ..!

విజయ, వింధ్య లిద్దరూ మూడోగది లోకి వెళ్లారు.

అక్కడా ఒక అమ్మాయి వుంది. ఆ అమ్మాయిపేరు చంద్రట.! అక్కడా ఒక కాళీవిగ్రహంవుంది. దానివల్ల మరో గదిలోకి ముగ్గురూ వెళ్లారు.

ఇలా గదిలోగది, గదిలోగదిరా సాగాయి. ప్రతిగదిలోను ఒక్కొక్క అమ్మాయి చొప్పున విజయ లక్ష్మితో తొంభై తొమ్మిదిమంది అయ్యారు.



7

"ఏమిటిదంతా అయోమయంగా వుందే...! అసలీ రాక్షసి మనల్ని యెందుకు తీసుకువచ్చాడో మీలో ఎవరికయినా తెలుసా?" అని అడిగింది అందరి మధ్య కూర్చొని విజయలక్ష్మి.

"నాకు తెలుసు..." అంది రత్నావళి అనే అమ్మాయి. "ఎందుకో చెప్పు..." అన్నారంతా.

"ఈ రాక్షసికి ఒక కోరిక వుందట...! అదేమిటంటే, తనే రూపుకావాలంటే ఆ రూపురావాలని..! అది ఎలాటి దతుందా అని ఆలోచించింది. - దీని కులదేవతకిగాని వందమంది రాజకన్యలని బలియిస్తే, ఆ దేవత అడిగిన వరం యిస్తుందిట...! అందుకే..!" అంది రత్న.

"ఎందుకూ, దీనికాకోరిక కలిగింది?" అంది చంద్ర.

"ఎందుకేమిటె, అందమయిన రాకుమార్తెలాగ అవడం ఎరాజకుమారుణ్ణో మోసగించడం...!ఇంతే..."

"మరి, నీకెలా తెలిసిందీ కథ!" అంది వింధ్య.

"ఎలా ఏమిటె? ఇది నన్ను తీసుకొచ్చిన నాడు ఇంకా తొంభైమందిని తీసుకురావాలి!" అంటూ దాని నౌకరుతో చెబుతూ ఈ కథంతా వాడితో చెప్పింది!" అంది రత్న.

"దీని ప్రాణరహస్యం ఎవరికయినా తెలుసా?" అని అడిగింది విజయలక్ష్మి.

"అంటే..?" అని అర్థంగాక అడిగింది ఒక అమ్మాయి

"అంటే, ప్రతీరాక్షసీ, తన ప్రాణాన్ని వేరేచోట రహస్యంగా దాచుతుంది! ఆ వాడుకుంది!" అని చెప్పింది విజయ.

అసలు ప్రాణరహస్యం మొత్తంమీద ఎవరికి తెలిసింది కాదు. విజయదూరం ఆలోచించి యిలా చెప్పింది.

"ఇదో, అక్కయ్యలూ! చెల్లాయిలూ!! మనలో వందమందికి ఒకరుతక్కువ...! ఆ ఒక్కర్ని తీసుకువస్తే, మనపనిఖాళీ..! నేనో ఉపాయం చెబుతాను అలా చెయ్యండి!"

"అలాగే చేస్తాం ... అక్కా ...!" అన్నారంతా ఏక కంఠంతో. విజయలక్ష్మి తనవుపాయాన్ని అందరికి చెప్పింది.

(సశేషము)

# బాలనాగమ్మ కథ

(క్రీ. శ. 1340 ప్రాంతం)

శ్రీ ఏకుమళ్ల కామేశ్వరరావు

(గతసంచిక తరువాయి)

---

## సుప్రసిద్ధ గుణాలు

బాలనాగమ్మకథలో సుప్రసిద్ధ గుణాలు కొన్ని ఉన్నాయి. దానిలోని సామాన్య జీవిత (common Place) వర్ణన అందరిని ఆకర్షిస్తుంది. నిత్యము మనకళ్ళఎదుట చూస్తూన్న సాంఘిక జీవనాన్ని కవి ఈ కథలో చేర్చేడు. పిల్లలు జన్మించడం, వేడుకలు, మరణాలు, బాధలు, గాజులసెట్టి, చాకలి, బ్రాహ్మడు మొదలైన సామాన్య విషయాలు కథలో వర్ణించబడ్డాయి. ' రాజు ఢిల్లీకి వెళుతూండగా, అతని పిల్లలు అతన్ని ఢిల్లీనుంచి బొమ్మలు మొదలైనవి తెమ్మన్నారు. ఈ అంశం సామాన్య జీవితంలోది. ఇట్టి సామాన్యాంశాల కథనమే కథకొక ఆకర్షణ నిస్తుంది.

ఈ జానపదకవి సాహిత్యంలో కొన్ని కొత్త పాత్రలను సృష్టించేడు. జీవాత్మను ఒక పాత్రగా కల్పించేడు. లక్ష్మీదేవియొక్క జీవాత్మ ఆమె పిల్లలకోసం ఎంతో అవస్థపడుతుంది. అనేకం సృష్టిస్తుంది. ఇదివరకు ఏకవీకూడ తెలుగులో ఇటువంటి విచిత్రపాత్రను సృష్టించలేదు. భవభూతి ఒక విధంగా ఉత్తరరామ చరితములో సీతాదేవి పాత్రను, షేక్స్పియరుకవి ఇంగ్లీషులో దయ్యాల పాత్రలను సృశించేరు.

తెలుగు వాఙ్మయంలో ఒక అపూర్వమైన పాత్రను సృష్టించేడు ఈ పదకవి. అదేదంటే, మాయలఫకీరు. ఈ పాత్రలో ఎన్ని తమాషాలుండాలో అన్నీ ఉన్నాయి. ఈ పాత్ర ఆంధ్ర వాఙ్మయ పుటాకాశంలో చిరస్థాయి అయిన నక్షత్రం. ఇట్టి పాత్రను కల్పించినందుకు ఈ కవిని ఎంత పొగడినా తీరదు.

హాస్యరసం తెలుగు ప్రబంధ వాఙ్మయంలో అధికంగా కనబడదు. కాని ప్రజా వాఙ్మయంలో చాల వరకుఉంది. కాని వాటిలో వెనుకటి పాత్రల అనుకరణమే ఎక్కువ - అనగా విదూషకుడు, చోడిగాడు మొదలైనవి. అంతేకాని కొత్త పాత్రలు తక్కువ. అటువంటి సందర్భంలో బాలనాగమ్మ కథలో పొట్టచెక్కలయ్యేటంత హాస్యముంది. మాయలఫకీరు జంగంవేషం వేసుకొని తలారి రాముడికి పిల్లలనిచ్చిన ఘట్టం అతిరమ్యమైనది. ఆంగ్ల మహాకవి అయిన రాబర్టు బ్రౌనింగు, హేమలిన్ యొక్క వింత సన్నాయి పాటకుడు అను ఖండ కావ్యంలో యిటువంటి హాస్యమేసృష్టించేడు. కాని దానికంటెకూడ బాలనాగమ్మకథలోని హాస్యఘట్టం సరదాగ ఉంది.

ఈ కవికి హాస్యరసం శక్తి బాగా తెలును. కాబట్టి అవకాశం వచ్చిందంటే ఊరకే పోనీయడు. చాకలి తిప్పడు రాజకుమార్తెను పెళ్ళాడడానికి పడ్డ పాట్లుః చూసి నవ్వుతాము. నాగంభట్లు మరణాన్ని చూసి నవ్వుతాము. వంగపట్టణపు రాజు ఉపాఖ్యానాన్ని ఈ కవి నవ్వులకోసమే సృష్టించి ఉంటాడు. తంబళ్లమ్మకి ఉండే కాస్తగూనీ వరహాల మూటను పెట్టుకోడానికి వచ్చిందిట (పుట 94)! ఇట్లు ఇతని హాస్యం పరమానందదాయకం.

ఈ కథలోని ఒక సొగసేమిటంటే - పాత్రోచిత

భాష. ఫకీరు యొక్క హిందుస్థాని మిశ్రభాష బాగుంది.

ఈ జంగంకథలో దేవుణ్ణి భూమిమీదికి విపరీతంగా తీసుకురాలేదు. అద్భుతాలు వేరు, ఈశ్వర భక్తి వేరు!

### రసం

ఈ గేయంలో రసం చక్కగా పోషించబడింది. సంతతిలేని లక్ష్మీదేవి తన వెత్తని ఇట్లు చెప్పుకొంది-

కందులు కొట్టిన కళ్లమందు రేమి
కాయలుకొట్టిన మానులందు రేమి
దేవుడులేని దేవస్థలము నుబోలు
(పుట-4)

మునియొక్క తపోతీవ్రతను కవి ఇట్లు వర్ణించేడు-

ఎండను ఆహారముగా జేసుకోని
నీడను దాహముగా జేసుకోని.

తల్లి చావు పిల్లల అవస్థను గురించి-

చీమల పుట్టకు చిచ్చుపెట్టుతుంది
చీమల దోమల నెవరు సాకుతారు

అన్నాడు రాజు.

ఆంధ్ర మహాభారతంలోని యుద్ధవర్ణనలలాగె ఈ జానపదగేయంలోకూడ యుద్ధవర్ణనలను అతి నిపుణంగా చేసేడు.

రాజు, రెండోభార్యమీది మోజుతో మొదటి భార్య పిల్లలను అడివిలో విడిచి వచ్చేడని చెప్పడం అతిశయోక్తిగా కనపడవచ్చు. కాని అదికాదు. భార్యాలోలుడైనరాజు ఎంత అవివేకంగా ప్రవర్తించేడో తెలుస్తూంది. బాలవద్దిరాజే పులిని చంపేడని అంతఃపురంలోని సుభద్ర అందరికంటె ముందుగా తెలుసుకొంది అని చెప్పడం అసమంజసం

### వచనం

బాలనాగమ్మకథలోని వచనం కొంతభాగం మాత్రమె. దానిలోకూడ కథ కొనసాగించబడింది. కాంభోజరాజు, చిన్నమ్మ, బంగారు తిమ్మరాజు కథలలో వచనంకూడ కథలోని భాగమె. బాల నాగమ్మకథలోని వచనం కొన్నిచోట్ల చాల దీర్ఘంగా పుటలకు పుటలేఉంది.

### శైలి

ఈ గేయం సామాన్య జనుల భాషలో వ్రాయబడింది. విపులంగా చెప్పడమంటె కవికి ఇష్టం. కాని వర్ణనకోసమె చేయబడ్డ వర్ణన లెక్కడాలేవు. భాష సులభం. హిందూస్థానీ మాటలు అధికంగా ఉన్నాయి.

### జాతీయాలు, మాటలు

ఈ పాటలో అనేక జాతీయాలు వాడబడ్డాయి. తక్కువ నోములునోచి ఎక్కువ ఫలములు రమ్మంటే (4) మహాముని చెవులలోపల నాగుబాములే ఇరవుచేసినయ్యా (5)

జిల్లేడాకువేసిన బందము (ఇది సిరసం తెలియచేయడానికి చెప్పిన పోలిక) (10)

గడిగాసము - స్వయంపాకము (12) కత్తికో కండగా కోయుట (14), రక్షించినవానిని భక్షించుట (15), కాకిశోకం (17), వ్రతంచెడ్డా సుఖం తప్పదు (19), పప్పన్నము (20), గవ్వకాను అప్పిచ్చుట (41), పువ్వులమ్మేచోట కట్టెలమ్ముట (41).

జంగంవచ్చినా, జోగివచ్చినా
అరదేశివచ్చినా, పరదేసివచ్చినా
భట్టువచ్చినా, బ్రాహ్మడువచ్చినా (44)

పొంగదెల్లా కుంగేదానికే (46), వెంకటగిరి పాగా (47), చచ్చి ఎవరిని సాధించుట (58), మొగసిరి 58, నిద్రలు నీరుగానులే 60, పొంగు అణుగుట (60,) వెంట్రుకబట్టుక కొండబాకుట (72), తలపండు పగల (107), పెళ్లి పెన్నలోకలియుట (76), దొంగలు, తోడుబోతులు (76) (గడ్డంపట్టుకొనిబతిమాలుట (68), పుక్కిటివిడెము చెదరనవ్వుట 114 మొదలైనవి.

అచ్చు పుస్తకంలో తప్పులు విస్తారంగా ఉన్నాయి. దీనికి మంచి ప్రతి అత్యవసరం.



# కీర్తన

శ్రీమతి ఓలేటి సూర్యప్రభాదేవి

"మా తెనుగు తల్లికీ - మల్లెపూదండ" అను వరుసవలె

మా రామచంద్రుడూ మంగళాకరుడు, మా తల్లి జానకీ మహిత చారిత్ర
కమనీయ రూపుండు, కరుణారసార్ద్రింబౌ హృదయంబుగలవాడు ఉరగ
భూషణనుతుడు. "

సురలెల్ల పూజింప ఉరమునను శ్రీదేవి మురియుచున్ వసియింప
చెలగుచునునుండే నీ రూపు జూపుమా నిర్మలానంద అలఅల ।
మా పాపములనెల్ల మాయజేయు —

శ్రీనాథ నీ పదములే నాకు గతిగాద, రఘునాథ బ్రోవగన్ రావయ్య వేవేగ
మోదంబొసంగుమా, మురవైరిశౌరీ … … …

శ్రీవరా భూవరా శ్రితులతో పరమాత్మ కౌసల్య నీతల్లి కని నిన్ను తనివొందె
కావవే ఆ తరుణి ఘనమైన దయకల్గి, ఆ విధముగనె నాదు ఆర్తిబాపుము దేవ

అభయంబొసంగుమా హరీ "ప్రభ" నేలునో శ్రీ హరీ హేరామచంద్రా
శ్రీరామచంద్రా! మా రామచంద్రుడూ - మంగళాకరుడూ ॥

---

## వార్షికోత్సవము

అమలాపురంలో అక్టోబరు, 25, 26 తేదీలలో రాజమండ్రి ఆంధ్రయువతీ సంస్కృత కళాశాల ప్రిన్సిపాలు శ్రీమతి బత్తుల కామాక్షమ్మగారి అధ్యక్షతన కోనసీమ మహిళా సంఘపు వార్షికోత్సవము వైభవముగా జరిగినది. శ్రీమతి చాగంటి శేషమ్మగారు పతాకోత్సవమును జరిపిరి. శ్రీమతి పెద్దాడ కమలమ్మగారు సభను ప్రారంభించిరి.

డాక్టరు గోజేటి సరస్వతిగారు ఆహ్వాన సంఘ అధ్యక్షోపన్యాసములో అమలాపురంలో మహిళా క్లబ్ యొక్క ఆవశ్యకతను గురించి వివరించి దాని నిర్మాణ నిర్వహణలను గురించి, అభ్యుదయ కార్యక్రమమును గురించి వివరిస్తూ మహిళల ఆర్థిక, సాంఘిక పురోభివృద్ధికి మహిళా సంఘాల నిర్మాణం అత్యవసరమని చెప్పిరి.

శ్రీమతి కామాక్షమ్మగారు ఉపన్యసిస్తూ స్త్రీలు విద్యా విజ్ఞానములపట్ల ఆసక్తికలిగి తమ అభ్యుదయ అభివృద్ధులను రూపొందించుకోవాలనియు, దానున్న సంఘంలోని విప్లవాత్మకమైన మార్పులను గమనిస్తూ అభ్యుదయాన్ని శాయశక్తుల ప్రోత్సహించాలన్నారు.

కార్యదర్శిని శ్రీమతి గుమ్మడిదల రాణీ ఝాన్సీలక్ష్మీబాయిగారు వార్షిక నివేదికను, ప్రముఖుల సందేశములు చదివిన తరువాత గాన, బుర్రకథ, భరతనాట్య కార్యక్రమములతో మొదటిరోజు ఉత్సవ కార్యక్రమము ముగింపుకువచ్చెను. రెండవరోజు తీర్మానములు, బాలికలకు బహుమతుల ప్రదానము జరిగెను.

---




'జాగృతి' విజయదశమి ప్రత్యేక సంచిక మా కార్యాలయమునకు చేరినది. ఆకర్షణీయమైన త్రివర్ణ ముఖచిత్రముతో సుప్రసిద్ధ రచయితల రచనలతో సర్వాంగ సుందరముగానున్నది. భారతీయ జాతీయతను, సంస్కృతిని వేనోళ్ల చాటుతూన్న రచనలు యీ సంచికకు ప్రత్యేకత. ఈ సంచికను వెలువడజేయడములో సంపాదకులు శ్రీ బి. వెంకటరత్నంగారి కృషి ప్రశంసనీయము. వెల 0-12-0. ప్రాప్తిస్థానము మేనేజరు 'జాగృతి', బకింగ్ హాంపేట, విజయవాడ-2.

♦ ♦ ♦

'వాహిని' ఆచార్యరంగాగారి జన్మదినోత్సవ సందర్భమున వెలువడిన సంచిక మా కార్యాలయమునకు చేరినది. వెల 0-8-0.

ఇందులో రంగాగారి జీవిత చరిత్రలోని విశేషాలను గురించి ఆయన సహచరులు, అనుచరులు రచించిన గద్య, పద్య, గేయ రచనలు అనేకమున్నవి. రంగాగారి నాయకత్వాన్ని ప్రశంసించుచు సామాన్య ప్రజలలో-ముఖ్యంగా రైతు లోకంలో నవచైతన్యమును పూరించిన విధాన్ని వివరించిన అనేక వ్యాసాలున్నవి. సంపాదకులు శ్రీ జి. ఉమామహేశ్వరరావు. ప్రాప్తిస్థానము వాహిని కార్యాలయము, విజయవాడ-2.

జగద్గురువు (శంకరగురు చరితము) : కుమారి సుందరి. ప్రచురణకర్త : శ్రీ టి. అప్పారావు యం. ఏ., మురారి బిల్డింగ్ బళ్లారి.

కుమారి సుందరి జగద్గురు శ్రీ శంకరుల చరితమును పద్యకావ్యముగా రచయించినదీ పుస్తకము. సరళమైన శైలిలో మనోజ్ఞంగా నడిచిన అభ్యుదయకవిత. పాత్రపోషణమున కనువుగ, కథనించుక మార్చి కూర్చిన యీ చరితము రచయిత్రి వ్యక్తిత్వమును ప్రతిబింబింపచేయుచున్నది.

శ్రీ వేంకటేశ సుప్రభాతము (ఆంధ్రీకరణము) : శ్రీ కె. నారాయణరావు, తహసిల్దారు, కావలి, నెల్లూరుజిల్లా.

ఇందులో మూల శ్లోకములతోబాటు ఆంధ్రీకృత ద్విపదలు పొందుపరచబడి, లఘుటీక సయితము చేర్చబడియున్నది.

గ్రంథకర్త భక్తి పారవశ్యంతో శ్రీ వేంకటేశ్వరస్వామిని మేలుకొలుపుల రూపంగా స్తుతించి, భజించ డాని కుద్దేశించిన ఈరచన విశేషంగా ప్రజాదరణ పొందగలదని మా నమ్మకము.

యాజ్ఞవల్క్య చరిత్రము (ఘట్టు ప్రభువు). సంపాదకుడు శ్రీ లింగంగుంట వెంకట సుబ్బయ్య, నెం-1, ఆరుముగంశెట్టివీధి, తిరువల్లిక్కేణి, మద్రాసు-5. వెల రు. 1-0-0.

గట్టు ప్రభువు రచించిన యాజ్ఞవల్క్యచరిత్ర పద్యకావ్యము అమూల్యమైనది. యాజ్ఞవల్క్యుడు తపో సంపన్నుడే కాక ఆనాడములలోనున్న న్యాయ సిద్ధాంతములను క్రోడీకరించి స్మృతిగా రూపొందించి మన కందించినవాడు. ఈ మహనీయుని జీవిత చరిత్రమును ప్రచురించినందుకు సంపాదకులు అభినందనీయులు.

—o—

# సంపాదకీయములు

## ఆర్థిక, సాంఘిక రంగాలలోని అన్యాయాలు

న్యూఢిల్లీలో ప్రధాని నెహ్రూ సంఘసేవకుల సమావేశంలో ఉపన్యసిస్తూ సంఘదురాచారాలను, ఆర్థిక అన్యాయాలను తొలగించాలంటే వాటిమూల కారణములను తెలుసుకొని నిర్మూలించాలికాని తొందరపాటువల్ల లాభముండదని చెప్పారు.

సాంఘిక, ఆర్థిక రంగాలు దేనికది స్వతంత్రమైనవి కావు. పరస్పర సహాయంతోనే కాని అభ్యుదయపు రోభివృద్ధులు సమకూరవు. సాంఘిక దురాచారాలు నిర్మూలించబడాలంటే ఆర్థికరంగంలో విచక్షణారహితమయిన న్యాయంజరుగాలి. అంటే ప్రజల కృషికి అవకాశము, దానికి తగిన ప్రతిఫలము, దాంతో కూడు, గుడ్డ, తల దాచుకోడానికి గృహవసతులు, తమకు తమబిడ్డలకు వైద్యవిద్యా వసతులులాంటి జీవితావసరాలు లభ్యమయిననాడు సంఘదురాచాలు పరిమితముకాగలవు. క్రమంగానైనా త్వరితగతిన కలిమిలేముల మధ్యగల అఘాతము పూడిపోయి జాతీయ సంపద, ఆదాయము, ఉన్న ఆర్థిక, సాంఘిక అవకాశములు సమానముగా ప్రజాశ్రేయస్సు నుద్దేశించిననాడు సాధించకలిగే పురోభివృద్ధి యీనాటికంటె మెరుగుగా నుండగలదు.

## జాతివిచక్షణ అభివృద్ధినిరోధకం!

దక్షిణాఫ్రికా ప్రభుత్వము జాతి విచక్షణను అమలు పరచడానికి కృతనిశ్చయతుయింది. అంటే అభ్యుదయకాముకులమనుకునే పాశ్చాత్య దేశాలవారికిది తలవంపులైనా, మిత్రరాజ్యసమితి న్యాయ దృష్టితో యీ అన్యాయాన్ని, అఘాయిత్యాన్ని అరికట్టలేక పోవడం చిత్తశుద్ధికి సాదృశ్యంకానేరదు.

## మరలు-మనుష్యులు

యంత్రములు మానవ నిర్మితములు. మానవుడు బుద్ధిబలాన్ని, విజ్ఞాన, విద్యలను వినియోగించి స్వీయ శ్రేయస్సు నుద్దేశించి యంత్రములను నిర్మించడం జరిగింది. ఆరంభంలో యంత్రమును కనుగొనేటప్పుడు మానవుని ఉద్దేశము మంచిదైనా దరిమిలా తెలిసి కొంత, తెలియక కొంత యంత్రములవలన అపకారం జరుగుచుండుట ప్రత్యక్షంగా చూస్తున్నాము. అయితే మానవుడు పరిశోధన, కృషి ఫలితంగా యంత్రములను తమ శ్రేయస్సౌభాగ్యాల అభివృద్ధికి వినియోగించుకోవాలి.

భారీయంత్ర పరిశ్రమలు చేతివృత్తులకు విఘాతము కల్పించిన విషయము వాస్తవమే. కాని సాధ్యమైనంత వరకు యంత్ర పరిశ్రమలద్వారా విషాద, విపత్కర పరిస్థితులు వాటిల్లకుండా పరిరక్షించుకుంటూ తమ అవసరాలను తీర్చలేని ఉత్పత్తులను, అంతర్జాతీయ రంగంలో వర్తక వ్యాపారముల కుపయోగపడు ఉత్పత్తులను భారీయంత్ర పరిశ్రమలకు కేటాయించి సాధ్యమైనంతవరకు జాతీయ నిత్యావసరాలను కుటీర పరిశ్రమలకు కేటాయింపు జరుగాలి.

అందుకే పండిత నెహ్రూ "మానవుడు మరలకు దాసుడుకాగాదు" అన్నాడీ మధ్య. అంటే యంత్రములు మానవుని విచక్షణా దృష్టినిబట్టి ఉపకారం అపకారం చేయగలవు కాబట్టి, ఉపకారాన్నే పొందడమనేది మానవుని చేతిలోనేయున్నది.

—o—

# శ్రీ మన్మథనామ సం॥ర కార్తీక - మార్గశీర్ష మాసములు

| | | | |
|---|---|---|---|
| 1955 సం॥ నవంబరు నెల | 16 | బు | విది 34.7 జ్యేష్ట 60.10 |
| | 17 | గు | తదె 38-33 జ్యేష్ట 4.10 త్యా 4.24 |
| | 18 | శు | చ 43.23 మూ 10.10 నాగచతుర్థి |
| | 19 | శ | పం 48.1 పూషా 16.4 త్యా 4.23 |
| | 20 | ఆ | ష 52.10 ఉషా 21.39 |
| | 21 | సో | స 55 36 శ్ర 26.39 త్యా 4.18 అమృతసిద్ధియోగః |
| | 22 | మం | అ 58 6 ధ 30.51 |
| | 23 | బు | న 59-27 శత 34.2 |
| | 24 | గు | ద 59 33 పూభా 36.2 త్యాజ్యాభావః |
| | 25 | శు | ఏ 58.22 ఉభా 36.51 |
| | 26 | శ | ద్వా 55.55 రేవ 39.26 |
| | 27 | ఆ | త్రి 52 15 అశ్వ 34.49 త్యా 3.50 |
| | 28 | సో | చతు 47.38 భ 32.11 |
| | 29 | మం | ○ 42.9 కృ 28.41 చంద్రగ్రహణం |
| | 30 | బు | కృపా 36.8 రో 24 33 |
| 1955 సం॥ డిశంబరు నెల | 1 | గు | విది 29.49 మృ 20.4 |
| | 2 | శు | త 23.28 ఆర్ద్ర 15.28 |
| | 3 | శ | చ 17.20 పున 11.2 |
| | 4 | ఆ | పం 11.42 పుష్య 7.4 |
| | 5 | సో | ష 6.46 ఆశ్లే 3.46 త్యా 3.50 |
| | 6 | మం | స 2.45 ఏష్య 56-44 మఘ 1.21 |
| | 7 | బు | న 57.48 పూఫ 0.4 ఉత్త 59-34 |
| | 8 | గు | ద 57.24 హ 60-10 |
| | 9 | శు | ఏ 58.15 హ 0.59 |
| | 10 | శ | ద్వా 60.10 చిత్త 3.17 |
| | 11 | ఆ | ద్వా 0.3 స్వా 6.42 |
| | 12 | సో | త్ర 3.30 విశా 11.1 |
| | 13 | మం | చతు 7.23 అనూ 16 9 |
| | 14 | బు | ● అమా 11.57 జ్యే 21.56 సూర్యగ్రహణం |
| | | | **మార్గశీర్ష మాసము** |
| | 15 | గు | శుక్లపా 16.45 మూల 27.54 |

Printed & Published by Dr. S. Seshagiri Rao, at Lodhra Press, Kesari Kuteeram Ltd.
15, Westcott Road, Royapettah, Madras.
Ag. Editor : C. C. Punniah.



ప్రాణాయామం పట్టి
ముళ్ల పరుపుమీద పడు-
కోవడం సన్యాసికి చేతనయితే

# లోధ్ర




సేవించి ఆరోగ్య ★★★
సౌందర్యాలు పెంపొందించు
కొంటూ ఉత్సాహంగావుండ
డము ఆమె చేతనవును.
"లోధ్ర" ఋతు దోషాలను
పారద్రోలి ఆరోగ్య సంతోష
సంతానములను సంప్రాప్తింప
జేయును



**కేసరి కుటీరం లిమిటెడ్,**
**రాయపేట, మద్రాస్.**